# సాహితీ మంజూష





రచన

పుట్టపర్తి నాగపద్మిని

సార్థక నామధేయ
ప్రశాంత జీవన సౌందర్య గ్రహణైక హృదయ
పరమ తారక నామానురక్తనీయ
పుట్టపర్తి కనకమ్మ నామధేయ
మన్మాతృమూర్తికి
యీ నా ప్రథమ వ్యాస సంకలనం
'సాహితీ మంజూష'
అంకితం

సార్థక నామధేయ
ప్రశాంత జీవన సౌందర్య గ్రహణైక హృదయ
పరమ తారక నామానురక్తనీయ
పుట్టపర్తి కనకమ్మ నామధేయ
మన్మాతృమూర్తికి
యీ నా ప్రథమ వ్యాస సంకలనం
'సాహితీ మంజూష'
అంకితం

# రజోధూళి

ఁతీమంజూష'- వెలుగు చూస్తున్న నా తొలి రచన. వివిధ పత్రిక
ంతమయిన వ్యాసాలు కొన్ని- మాతృసంస్థ ఆకాశవాణిలో ప్రసార
ంగాలు కొన్ని- యీ పుస్తకంలో చోటు చేసుకున్నాయి.

వ్యాసాల రచనలో యెక్కువగా నాకు తోడ్పడింది- మా యింటి

స్వతీ పరపుత్రులు, సాహితీ సార్వభౌములు, బ్రాహ్మీభూషణులు-
అయ్యగారు శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులవారు, సార్థక
పరమ తారకనామానురక్త హృదయ, సరళ హృదయానుశీల
అమ్మగారు- కుం. సౌ. పుట్టపర్తి కనకమ్మగారు- వీరిరువురి మధ్య
చేవో ఘర్షణలు, వాగ్వివాదాలు. ఘర్షణలు-అనగానే కుటుంబ విష
రువురికీ అంతగా సమన్వయం కుదిరేది కాదేమో అని అనుమానం
నీ వాస్తవానికి అలా లేనేలేదు. కుటుంబానికి సంబంధించిన యే
మా అయ్యగారికి అంతగా పట్టవు. యెంతసేపూ వారికి సాహిత్య
నే పొద్దు తెలిసేది కాదు. తన సంపాదన అంతా అమ్మ చేతిలో
గారి పని. తరువాత కుటుంబ నిర్వహణ అంతా అమ్మ చేతిమీదుగా
క ఘర్షణలకు తావెక్కడ అంటారేమో! భాగవతంలో శ్రీకృష్ణుని
గవతతత్త్వాన్ని అయ్యగారు మెచ్చుకుంటే- వాల్మీకి రామాయణం
మచంద్రుని సౌశీల్యానికి అమ్మ ముచ్చటపడేది. అన్నమయ్యలోని
క్తికి అయ్యగారు ఆశ్చర్యం ప్రకటిస్తే- త్యాగరాజులోని భక్తి పార
మ్మ మనసు వినీతమయ్యేది. ఆ సమయాల్లో వారిద్దరూ మా తల్లి
కాక, ఇద్దరు సాహితీవేత్తలలా దర్శనమిచ్చేవారు. వారి ఆ ఘర్షణ-
స్తత్త్వాల ఆసక్తికరమయిన సంఘర్షణలా వుండేది. ఇలాంటి వాగ్వి
రమణీయంగా కనిపించేవి, కర్ణరసాయనాలుగా అనుభూతమయ్యేవి.
రుధ్యాలున్నా, తాను వ్రాసిన ప్రతి కొత్త రచననూ మా అమ్మకు

# రజోధూళి

'సాహితీమంజూష'- వెలుగు చూస్తున్న నా తొలి రచన. వివిధ పత్రికలలో ప్రచురింతమయిన వ్యాసాలు కొన్ని- మాతృసంస్థ ఆకాశవాణిలో ప్రసారమయిన ప్రసంగాలు కొన్ని- యీ పుస్తకంలో చోటు చేసుకున్నాయి.

ఈ వ్యాసాల రచనలో యెక్కువగా నాకు తోడ్పడింది- మా యింటి వాతావరణం.

సరస్వతీ వరపుత్రులు, సాహితీ సార్వభౌములు, బ్రాహ్మీభూషణులు- అయిన మా అయ్యగారు శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులవారు, సార్థక నామధేయ, పరమ తారకనామానురక్త హృదయ, సరళ హృదయానుశీల అయిన మా అమ్మగారు- కుం. సౌ. పుట్టపర్తి కనకమ్మగారు- వీరిరువురి మధ్య యెప్పుడూ యేవో ఘర్షణలు, వాగ్వివాదాలు. ఘర్షణలు-అనగానే కుటుంబ విషయాలలో వీరిరువురికీ అంతగా సమన్వయం కుదిరేది కాదేమో అని అనుమానం రావచ్చు. కానీ వాస్తవానికి అలా లేనేలేదు. కుటుంబానికి సంబంధించిన యే విషయాలూ మా అయ్యగారికి అంతగా పట్టవు. యెంతసేపూ వారికి సాహిత్య వ్యాసంగంలోనే పొద్దు తెలిసేది కాదు. తన సంపాదన అంతా అమ్మ చేతిలో వుంచటమే వారి పని. తరువాత కుటుంబ నిర్వహణ అంతా అమ్మ చేతిమీదుగా జరిగేది. ఇక ఘర్షణలకు తావెక్కడ అంటారేమో! భాగవతంలో శ్రీకృష్ణుని పాత్రలోని భాగవతతత్త్వాన్ని అయ్యగారు మెచ్చుకుంటే- వాల్మీకి రామాయణంలోని శ్రీ రామచంద్రుని సౌశీల్యానికి అమ్మ ముచ్చటపడేవి. అన్నమయ్యలోని భావవైవిధ్యానికి అయ్యగారు ఆశ్చర్యం ప్రకటిస్తే- త్యాగరాజులోని భక్తి పారవశ్యంపట్ల అమ్మ మనసు వినీతమయ్యేది. ఆ సమయాల్లో వారిద్దరూ మా తల్లిదండ్రులుగా కాక, ఇద్దరు సాహితీవేత్తలలా దర్శనమిచ్చేవారు. వారి ఆ ఘర్షణ- గంభీర మనస్తత్త్వాల ఆసక్తికరమయిన సంఘర్షణలా వుండేది. ఇలాంటి వాగ్వివాదాలు- అతిరమణీయంగా కనిపించేవి, కర్ణరసాయనాలుగా అనుభూతమయ్యేవి. ఇన్ని భావవైరుధ్యాలున్నా, తాను వ్రాసిన ప్రతి కొత్త రచననూ మా అమ్మకు

పుస్తకం ముద్రణ విషయంలో అత్యంత శ్రద్ధ కనబరచి-
తీసుకొన్న శ్రీ పాండురంగయ్యగారి ఋణం తీర్చుకోలేనిది.
కములు.

ంజూష' ముఖపత్రాన్ని తన నేర్పుతో అందంగా రూపు
గారికి కృతజ్ఞతలు. నాదే ఆలస్యం- అయినా పుస్తకాన్ని
వేసిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి నానమస్కారాలు.

ప్రయత్నానికి తన సంపూర్ణ సహాయ సహకారాల నందించిన
హర్షవర్ధన్ గారికి ప్రత్యేకంగా యేమిచ్చేది?!

వినీతహృదయ
పుట్టపర్తి నాగపద్మిని

త పద్మశ్రీ
ట్టపర్తి నారాయణాచార్యులు కడప

ం. నాగపద్మినికి,

ః. నీ పుస్తకం అందింది. అయినా నాకు పీఠికలు వ్రాసే అభిలాష
వ. అది నీకు తెలిసిన విషయమే. అయినా రచనలో అంతశ్శక్తి
బ్రదుకుతుంది. సాహిత్యంలో ఇప్పుడే ప్రవేశిస్తున్నావు. కాబట్టి
జరావుగారి వంటి పెద్దల ఆశీర్వాదాలందడము మంచిదేమోనని

ఆశీస్సులతో
పుట్టపర్తి

ఇక యీ పుస్తకం ముద్రణ విషయంలో అత్యంత శ్రద్ధ కనబరచి- అన్ని జాగ్రత్తలూ తీసుకొన్న శ్రీ పాండురంగయ్యగారి ఋణం తీర్చుకోలేనిది. వారికి నా నమోవాకములు.

'సాహితీ మంజూష' ముఖపత్రాన్ని తన నేర్పుతో అందంగా రూపు దిద్దిన 'సుధామ' గారికి కృతజ్ఞతలు. నాదే ఆలస్యం- అయినా పుస్తకాన్ని పొందికగా అచ్చువేసిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి నానమస్కారాలు.

నా యీ ప్రయత్నానికి తన సంపూర్ణ సహాయ సహకారాల నందించిన మావారు శ్రీమాన్ హర్షవర్ధన్ గారికి ప్రత్యేకంగా యేమిచ్చేది?!

వినీతహృదయ

**పుట్టపర్తి నాగపద్మిని**

సరస్వతీపుత్ర పద్మశ్రీ
**డాక్టర్. పుట్టపర్తి నారాయణాచార్యులు** కడప

**చి. సౌ. కుం. నాగపద్మినికి,**

ఆశీః. నీ పుస్తకం అందింది. అయినా నాకు పీఠికలు వ్రాసే అభిలాష చాలా తక్కువ. అది నీకు తెలిసిన విషయమే. అయినా రచనలో అంతశ్శక్తి వుంటే అది బ్రదుకుతుంది. సాహిత్యంలో ఇప్పుడే ప్రవేశిస్తున్నావు. కాబట్టి శ్రీ రామానుజరావుగారి వంటి పెద్దల ఆశీర్వాదాలందడము మంచిదేమోనని పిస్తుంది.

ఆశీస్సులతో

పుట్టపర్తి

శ్రీమతి నాగపద్మిని బహుముఖ పరిజ్ఞానానికి, విమర్శనా
హిత్య దృక్పథానికి ప్రతిబింబముగా ఉన్నది. శ్రీమతి
లభమై సరళమై పఠనయోగ్యమై ఉన్నది. ఈ వ్యాసాలలో
ను మనం సులభంగా పోల్చుకొనవచ్చును. ఈ చిరు
గాగపద్మినికిగల ఉజ్వలమైన సారస్వత భవిష్యత్తును
విష్యత్తులో ఆమె యింకను అనేక గ్రంథాలను ముఖ్యంగా
హిత్య విమర్శ గ్రంథాలను ప్రకటించి తెలుగు భాషను
వలెనని నా కోరిక. ఆంధ్ర పాఠకలోకం పక్షాన యీ
ంథానికి సుస్వాగతం.

దేవులపల్లి రామానుజరావు

విషయ వైవిధ్యం శ్రీమతి నాగపద్మిని బహుముఖ పరిజ్ఞానానికి, విమర్శనా పటిమకు, సరస సాహిత్య దృక్పథానికి ప్రతిబింబముగా ఉన్నది. శ్రీమతి నాగపద్మిని శైలి సులభమై సరళమై పఠనయోగ్యమై ఉన్నది. ఈ వ్యాసాలలో మౌలికమైన విలువను మనం సులభంగా పోల్చుకొనవచ్చును. ఈ చిరు పొత్తం శ్రీమతి నాగపద్మినికిగల ఉజ్వలమైన సారస్వత భవిష్యత్తును సూచిస్తున్నది. భవిష్యత్తులో ఆమె యింకను అనేక గ్రంథాలను ముఖ్యంగా ప్రతిభావంతమైన సాహిత్య విమర్శ గ్రంథాలను ప్రకటించి తెలుగు భాషను సుసంపన్నం చేయవలెనని నా కోరిక. ఆంధ్ర పాఠకలోకం పక్షాన యీ సాహిత్య విమర్శ గ్రంథానికి సుస్వాగతం.

హైదరాబాదు,
25-5-1984

దేవులపల్లి రామానుజరావు

ం. హేమంత సీమంతినీ విలాసంలో గాథాసప్తశతి నాటి చలి
ఎది రచయిత్రి. 'గాథా సప్తశతిలో సామాజిక స్పృహ' మంచి
హాలింతల భావాలు, వర్షాకాలంలో పేదలు పడే బాధలు, పండిన
ాసిపోయే రైతుల మనస్థితి మొదలైనవి బాగా చిత్రించారు.
విచాతకం. ఈ చాతకం కృష్ణశాస్త్రిగారు. దీనిలో రచయిత్రి
ావుకతను కమనీయంగా చిత్రించింది.

ున్నీ సహృదయులకు మంచి విందులు. తండ్రిగారి రచనా
ు పుణికిపుచ్చుకొన్న ఈ రచయిత్రి శతసహస్రంగా ఇలాటి
ుదని విశ్వసిస్తున్నాను.

భాషాసేవకుడు

ర్ణిమ

తిరుమల రామచంద్ర

ఇది మంచి వ్యాసం. హేమంత సీమంతినీ విలాసంలో గాథాసప్తశతి నాటి చలి మంటలను చూపింది రచయిత్రి. 'గాథా సప్తశతిలో సామాజిక స్పృహ' మంచి వ్యాసం. పేద చూలింతల భావాలు, వర్షాకాలంలో పేదలు పడే బాధలు, పండిన పైరు చూచి మురిసిపోయే రైతుల మనస్థితి మొదలైనవి బాగా చిత్రించారు. చివరి వ్యాసం కవిచాతకం. ఈ చాతకం కృష్ణశాస్త్రిగారు. దీనిలో రచయిత్రి కృష్ణశాస్త్రిగారి భావుకతను కమనీయంగా చిత్రించింది.

వ్యాసాలన్నీ సహృదయులకు మంచి విందులు. తండ్రిగారి రచనా రామణీయకాన్ని పుణికిపుచ్చుకొన్న ఈ రచయిత్రి శతసహస్రంగా ఇలాటి విందులు చేస్తుందని విశ్వసిస్తున్నాను.

ఆదర్శనగర్,
రక్తాక్షి జ్యేష్ఠ పౌర్ణిమ

భాషాసేవకుడు
**తిరుమల రామచంద్ర**

# "గణాధిపతి"

ఞాననం భూతగణాది సేవితం
త్థ జంబూ ఫల చారు భక్షణం
మాసుతం, శోక వినాశ కారకం
మామి విఘ్నేశ్వర పాదపంకజం.''

న్ని ప్రారంభించేముందయినా 'శ్రీ గణేశాయ నమః' అంటూ దువుల ఆచారం. అలా చేస్తే ఆ పని నిర్విఘ్నంగా పూర్తవు సం. కేవలం హిందువులే కాదు. నేపాల్, చైనా, ఇండో లైన దేశాలలో కూడా యీ గణపతి పూజ వున్నదట !

త్త పురాణం ప్రకారం-జన్మించిన కొద్ది సేపట్లోనే శని వీక్షణా సుతుడికి శిరచ్ఛేదన జరిగింది. వెంటనే విష్ణువు ఒక యేనుగు వు మొండానికి అతికించినందువల్లే 'గజాననుడు' అని దే పురాణంలో మరొకచోట-'గజాననుడు' యేకదంతుడెలా కథ వుంది. ఓమారు పరశురాముడు - శివపార్వతుల డట ! అది వారు విశ్రాంతి తీసుకుంటున్న సమయం. గజా డు. కార్యనిర్వహణలో, గజాననుకీ పరశురాముడికీ జరిగిన ం విరిగిపోవటం జరిగింది. ఆ తరువాత శివపార్వతులు డి కోపం చల్లారటం జరిగి వుంటుందనుకోండి. అది

బౌద్ధంలో గణపతికి ప్రత్యేక స్థానముందంటారు. హఠ మూలాధార చక్రానికి అధిపతి గణపతేనట ! బౌద్ధులలో క్కువ ప్రాధాన్యత యిస్తారు. కారణం - బుద్ధమాత మాయా

# "గణాధిపతి"

"గజాననం భూతగణాదిసేవితం
కపిత్థ జంబూ ఫల చారు భక్షణం
ఉమాసుతం, శోక వినాశ కారకం
నమామి విఘ్నేశ్వర పాదపంకజం."

ఏ శుభ కార్యాన్ని ప్రారంభించేముందయినా 'శ్రీ గణేశాయ నమః' అంటూ ప్రారంభించటం హిందువుల ఆచారం. అలా చేస్తే ఆ పని నిర్విఘ్నంగా పూర్తవుతుందని వాళ్ల విశ్వాసం. కేవలం హిందువులే కాదు. నేపాల్, చైనా, ఇండో చైనా, జపాన్ మొదలైన దేశాలలో కూడా యీ గణపతి పూజ వున్నదట!

బ్రహ్మ వైవర్త పురాణం ప్రకారం-జన్మించిన కొద్ది సేపట్లోనే శని వీక్షణానికి గురయిన పార్వతీసుతుడికి శిరచ్ఛేదన జరిగింది. వెంటనే విష్ణువు ఒక యేనుగు తలను తెచ్చి, ఆ శిశువు మొండానికి అతికించినందువల్లే 'గజాననుడు' అని పేరు వచ్చిందట! ఇదే పురాణంలో మరొకచోట-'గజాననుడు' యేకదంతుడెలా అయ్యాడన్న దానికో కథ వుంది. ఓమారు పరశురాముడు - శివపార్వతుల దర్శనం కోసం వెళ్లాడట! అది వారు విశ్రాంతి తీసుకుంటున్న సమయం. గజాననుడు - ద్వారపాలకుడు. కార్యనిర్వహణలో, గజాననుకీ పరశురాముడికీ జరిగిన ఘర్షణలో ఒక దంతం విరిగిపోవటం జరిగింది. ఆ తరువాత శివపార్వతులు రావటం, పరశురాముడి కోపం చల్లారటం జరిగి వుంటుందనుకోండి. అది విషయాంతరం.

మహాయాన బౌద్ధంలో గణపతికి ప్రత్యేక స్థానముందంటారు. హఠయోగంలో చెప్పబడే మూలాధార చక్రానికి అధిపతి గణపతేనట! బౌద్ధులలో 'శ్వేతగజానికి' యెక్కువ ప్రాధాన్యత యిస్తారు. కారణం - బుద్ధమాత మాయా

వల్ల 'గజవదనమే' ఆ గౌరవానికి అర్హతను సంపాదిచుం
ఒక కిటుకు వుందేమో ననిపిస్తుంది. ఏనుగు బుద్ధికుశలతకు,
ర్యానికి ప్రతీక. ఇతర జంతువుల్లా అన్ని వస్తువులనూ తినటా
ను గజరాజు. తనకు నచ్చిన వస్తువును - గంభీరంగా -
సుంటాడు. కళ్ళు చిన్నవి. కానీ యెంత దూరంలోనున్నా యే
ంగట్టగల చురుకుతనం వున్నవి. ఇక చెవులు పెద్దవి కావటం
శబ్దం కూడా వినపడకుండా తప్పించుకొని పోవటం కల్ల.
కూడా ప్రతి విషయాన్నీ నిశితంగా పరిశీలించి, పరీక్షించి
. మంచీ చెడూ అన్నీ పొల్లుపోకుండా వినిపిస్తున్నా- అన్నీ విని
క అభిప్రాయం యేర్పరచుకోవటం కాక - అన్నింటినీ సుని
మాసి, బుద్ధికుశలతను వుపయోగించి, గంభీరంగా ఆలోచించి
ం తీసుకోవాలి. ఇదీ 'గజాననం' లోని రహస్యం.

ోదరం' సంగతి. పెద్ద చెవులతో విన్న ప్రతి విషయాన్నీ
లో దాచుకోవాలి. అక్కడా ఇక్కడా బయట పెట్టకూడదు.
వాటిలో మంచిని యెంచుకుని, అవసరమైన చోట మాత్రం
ులి.

ఏకదంతుడు. ఈ ఏక దంతం మనకు ఐకమత్య భావనను
సాధకుడు ప్రపంచంలో అన్నింటినీ సమానంగా చూడాలని
బీద-ధనిక, తర - తమ భేదాలతో చూడటం మంచిదికాదు-
కదంతం బోధించే పాఠం.

స సిందూర ధారణ గురించి. సిందూరం మంగళ ప్రదం.
ణేశుని మంగళ ప్రదమైన సిందూరంతో పూజించినందువల్ల
ంగా, కార్యాలు పూర్తయేందుకు కటాక్షిస్తాడన్నది - యుక్తి

ర్వాయుగ్మం పూజయామి' అని గణపతిని పూజించటంలో
ర్యం వున్నది. ఇది ఒక రకమైన గడ్డి. గజరాజుకు అత్యంత
ఇందులో నమ్రత - సరళత వున్నాయి. ఆయుర్వేదం

పోవటం - అందువల్ల 'గజవదనమే' ఆ గౌరవానికి అర్హతను సంపాదిచుం కోవటంలో కూడా ఒక కిటుకు వుందేమో ననిపిస్తుంది. ఏనుగు బుద్ధికుశలతకు, ధైర్యానికి, గాంభీర్యానికి ప్రతీక. ఇతర జంతువుల్లా అన్ని వస్తువులనూ తినటానికి ముందుకురకడు గజరాజు. తనకు నచ్చిన వస్తువును - గంభీరంగా - హుందాగా అందుకుంటాడు. కళ్ళు చిన్నవి. కానీ యెంత దూరంలోనున్నా యే వస్తువునయినా పసిగట్టగల చురుకుతనం వున్నవి. ఇక చెవులు పెద్దవి కావటం వల్ల, అతి చిన్న శబ్దం కూడా వినపడకుండా తప్పించుకొని పోవటం కల్ల. అలాగే సాధకుడు కూడా ప్రతి విషయాన్నీ నిశితంగా పరిశీలించి, పరీక్షించి అర్థం చేసుకోవాలి. మంచీ చెడూ అన్నీ పొల్లుపోకుండా వినిపిస్తున్నా- అన్నీ విని వాటిపై వెంటనే ఒక అభిప్రాయం యేర్పరచుకోవటం కాక - అన్నింటినీ సునిశితంగా పరికించి చూసి, బుద్ధికుశలతను వుపయోగించి, గంభీరంగా ఆలోచించి యేదయినా నిర్ణయం తీసుకోవాలి. ఇదీ 'గజాననం' లోని రహస్యం.

ఇక 'లంబోదరం' సంగతి. పెద్ద చెవులతో విన్న ప్రతి విషయాన్నీ జాగ్రత్తగా కడుపులో దాచుకోవాలి. అక్కడా ఇక్కడా బయట పెట్టకూడదు. తాను గ్రహించిన వాటిలో మంచిని యెంచుకుని, అవసరమైన చోట మాత్రం వుపయోగించుకోవాలి.

'గణపతి' ఏకదంతుడు. ఈ ఏక దంతం మనకు ఐకమత్య భావనను చాటి చెప్పుతుంది. సాధకుడు ప్రపంచంలో అన్నింటినీ సమానంగా చూడాలని దీని ముఖ్యోద్దేశం. బీద-ధనిక, తర - తమ భేదాలతో చూడటం మంచిదికాదు- అన్నదే గణపతి ఏకదంతం బోధించే పాఠం.

ఇక ఆయన సిందూర ధారణ గురించి. సిందూరం మంగళ ప్రదం. మంగళ మూర్తి గణేశుని మంగళ ప్రదమైన సిందూరంతో పూజించినందువల్ల మనకు మంగళకరంగా, కార్యాలు పూర్తయేందుకు కటాక్షిస్తాడన్నది - యుక్తి సంగతం.

ఇక 'దూర్వాయుగ్మం పూజయామి' అని గణపతిని పూజించటంలో కూడా ఒక రహస్యం వున్నది. ఇది ఒక రకమైన గడ్డి. గజరాజుకు అత్యంత ప్రీతిపాత్రమైనది. ఇందులో నమ్రత - సరళత వున్నాయి. ఆయుర్వేదం

'వక్రతుండుడు' అని పేరు వచ్చినది. ఆయన నాగయజ్ఞోపవీతం-హఠయోగంలో చెప్పబడే కుండలినీ శక్తికి ప్రతీక. గణపతి కుండలినీ శక్తికి అధిపతి. మూలాధార చక్రంపై వుండే త్రిగుణమయమైన కుండలినీ శక్తి, శ్రీ గణపతి చిన్మయ రూప ధ్యానంతో జాగృతమై, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత యిత్యాది చక్రాల గుండా పయనించి చివరకు సహస్రారంలో పరమ శివశక్తిలో ఐక్యమవుతుంది. ఇది హఠయోగానికి సంబంధించిన వివరణ.

ప్రమథగణాలకు అధిపతి కావటంవల్ల ఆయన 'గణపతి' కావటం ఒక కారణం. సత్, చిత్, ఆనందా లన్న మూడు గణాలకూ రక్షకుడవటంవల్ల ఆయనను గణపతి అన్నారు. జాగ్రత్- స్వప్న- సుషుప్త్యావస్థలకు అతీతుడు కాబట్టి ఆయన గణపతి. పృథ్వి- అంతరిక్ష- స్వర్గ-యీ త్రిగుణాలకూ అధిపతి కావటంవల్ల ఆయన 'గణపతి' అవటం జరిగింది. జ్యోతిషశాస్త్ర ప్రకారం- దేవగణ- మానవగణ- రాక్షస గణాలకు అధిపతి కావటంవల్ల కూడా గణాధిపతి ఆయన. మనస్సు చేత గ్రాహ్యము మరియు వాక్కుచేత వర్ణనీయము అయిన జగత్తు 'గ'కారం నుంచి వుత్పన్నమయింది. అలాగే మనస్సు- వాక్కు- యీ రెండింటికీ అతీతమైన బ్రహ్మవిద్యా స్వరూపుడైన పరమాత్మ 'ణ'కార స్వరూపుడు. ఈ భౌతిక జగత్తు- అధ్యాత్మ విద్య (బ్రహ్మవిద్య) లకు అధిపతి కాబట్టి ఆయన 'గణాధిపతి' లేక 'గణపతి' గా పిలువబడటం విశేషార్థం.

ఇన్ని విశేషాలున్న గణపతి రూపవైశిష్ట్యం తప్పక తెలుసుకొని- ఆ విధంగానే ధ్యానం చేయటంవల్ల- ఉత్తమగుణాలు అలవడటం- తద్వారా వుత్తమ పదము ప్రాప్తం కావటం తథ్యమేమో! "శుభాశుభే వైదిక లౌకికే వా, త్వమర్చనీయః ప్రథమం ప్రయత్నాత్'- అంటూ గణపతి ప్రార్థనతో పనులు ప్రారంభిస్తే అవి నిర్విఘ్నంగా కొనసాగుతాయట! సృష్టి కార్యము నిర్విఘ్నంగా కొనసాగేటందుకై- గణపతి సర్వ విఘ్నాలను తొలగించటం తన విభాగం క్రింద తీసుకున్నాడు. అందువల్లే ఆయనకు- విఘ్నాధిపతి- విఘ్నేశుడు, విఘ్ననాయకుడనీ పేర్లున్నాయి. పరపీడకులైనవారు, అసుర ప్రవృత్తి గలవారు చేసే నీచకార్యాలన్నిటికీ విఘ్నాలను కలిగించటం. గణాధిపతి ముఖ్యకార్యం. అలాగే సత్ప్రవృత్తులైన తన భక్తజనులు చేసే పరోపకార కార్యాలను మంగళ ప్రదంగా కొనసాగించటం ఆయనకు యిష్టమైన పని. మరి అన్నింటికన్నా వుత్తమమైన

# "బసవేశ్వరుడు – వీరశైవము"

"సెట్టి యెంబెనె సిరియాళన?
మడివాళ నెంబెనె మాచయ్యన?
డోహర నెంబెనె కక్కయ్యన?
మాదార నెంబెనె చిన్నయ్యన?
ఆను హొర్వువ నెందరె కూడల సంగయ్య నగువనయ్య!''—

''సెట్టియందునా సిరియాళుని?
మడివేలందునా మాచయ్యను?
మాలవాడందునా కక్కయ్యను?
మాదిగ యందునా చిన్నయ్యను?
నేను బాపడనినచో కూడల సంగయ్య నవ్వునయ్యా!''—

కుల మత తత్త్వాలను పక్కకు నెట్టి భక్తులందరిదీ ఒకే కులమని నమ్మి, చిన్ననాడే తన బ్రాహ్మణ కులాభిమానాన్ని పరిత్యజించి, మత ప్రచారకుడుగా, రాజకీయ చతురుడిగా, కవిగా, భావుకుడిగా, భక్త శిఖామణిగా- ఒకటేమిటి- అనేక రూపాల్లో సాక్షాత్కరించి తనచుట్టూ ఒక యుగాన్ని స్థిరపరచుకున్న బసవేశ్వరుని పలుకులివి. కేవలం కన్నడ సాహిత్య రంగాన్నే కాక పొరుగున వున్న ఆంధ్ర సాహిత్య రంగాన్ని గూడా ప్రభావితం చేసిన బసవేశ్వరుడు- కన్నడ శివకవులలో మూల విరాట్ వంటివాడు.

వేద విద్యా పారంగతులయిన పండిత ప్రకాండుల పటాటోపాలొకవైపు, అహింసా, కరుణ యిత్యాది భావాలను ఆధారంగా వుంచుకొని ప్రచారంలోకి వస్తున్న జైన బౌద్ధమతాల ప్రచారం ఒకవైపు, నిర్గుణ నిరీశ్వరవాద మొకవైపు, భౌతిక విలువలకు ప్రాధాన్యమిచ్చే చారువాక మొకవైపు, నలువైపుల నుంచీ ప్రజల మనస్సులకు దిక్కు తోచనీయకుండా చేస్తున్న సమయమది. నిజమయిన ఆత్మోన్నతి వాదమేదో తెలియక ప్రజలు అటుయిటు ఊగిసలాడుతున్న పరిస్థితి.

సమీపంలో వున్న 'ఇంగలేశ్వరం' అప్పుడు ప్రసిద్ధ ధార్మిక క్షేత్రంగా ప్రచారంలో వుండేది. బాల్యం నుండే బాహ్యాచారాల పట్ల యేహ్యాభావం కలిగింది ఆ బాలునికి. ఇతని జనన కాలం ముందే సంగమేశ్వరుడు తాపస వేషధారియై యీతని తల్లిదండ్రుల వద్దకు వచ్చి తన వృషభ వాహనం వారి పుత్రుడుగా జన్మ నొందగలడని తెలియజెప్పినట్లుగా 'బసవ పురాణం'లో వున్నది. అందువల్లనే యీ బాలునికి 'బసవణ్ణ' అని నామకరణంచేసి వుండవచ్చు. బాల్యంలోనే ఈ బాలుడు-తన తల్లిదండ్రులకు భక్తికి బ్రాహ్మణ ధర్మాచరణకు భేదం తెలియజేసి- గాయత్రీ మంత్రోపదేశాన్ని గూడా తిరస్కరించాడట ! ఏడు సంవత్సరాల చిరుత ప్రాయంలోనే యిల్లు పరిత్యజించి సంగమేశ్వరానికి చేరుకున్నాడు. ఆ బాలుని దైవభక్తి, నిష్ఠ, అలౌకిక బుద్ధికుశలతలను గమనించిన ఆ క్షేత్రాధిపతి ఆశ్చర్యపడి ఆ దేవాలయంలో ఆశ్రయమిచ్చాడు. విద్యాభ్యాసం ముగిసింది. నిరంతరమూ భగవత్పూజలో మునిగేవాడు బసవణ్ణ. కొన్ని రోజులకు సంగమేశ్వరుని సాక్షాత్కారమూ లభించింది. స్వామి ఆదేశానుసారంగా అప్పటి కళ్యాణ చాళుక్యుల రాజధాని అయిన కళ్యాణనగరం చేరుకున్నాడు. కలచూరళీ వంశజుడు బిజ్జలుడు అప్పటి రాజు. క్రీ.శ. 1150 ప్రాంతం వాటి మాట యిది. తన ఆస్థానంలోవున్న బసవణ్ణ అప్రతిమాన బుద్ధి కౌశలాన్ని - అలౌకిక వ్యక్తిత్వాన్ని చూసి మెచ్చిన బిజ్జలుడు ఉత్తమ పదవిని యిచ్చి సత్కరించాడు. రాజు ధనాగారాన్ని చూసే బాధ్యత అది. గంగాదేవి-మాయిదేవి అన్నవారు బసవణ్ణ యిల్లాళ్లయ్యారు. రాజు ధనాగారాన్ని కాపాడటమన్న బాధ్యతతోపాటు గృహస్థ ధర్మం నిర్వహిస్తున్న బసవణ్ణ తను చిన్ననాటినుండి అనుసరిస్తున్న 'శివభక్తిని' మాత్రమూ విడనాడలేదు. 'భండారి బసవన్న' అన్న పేరు వచ్చింది. శివ భక్తుల కోసం ధనాగారంలోని ధనాన్ని వినియోగిస్తున్న అతనితో బిజ్జలుడు అప్పుడప్పుడు ఘర్షణ పడేవాడు. కానీ అతనికి భయపడేవాడు కాదు బసవణ్ణ. 1167-68 లో బిజ్జలుని మరణం తరువాత కొంతకాలానికి నిరంతర శివ భక్తుల సేవచేసి - 'వీరశైవ' మతాన్ని స్థాపించి-శివభక్తులంటే యిట్లా వుండాలని నిరూపించి, స్వయంగా తానే 'బసవేశ్వరు'నిగా పేరుపొంది - కూడల సంగమేశ్వరుని సాయుజ్యం పొందాడన్నది చారిత్రక పరిశోధకుల ఉవాచ.

ఇతని సూక్తులు 'బసవేశ్వర వచనాలు'గా ప్రసిద్ధి పొందినాయి. వచనమంటే గద్యమని అర్థంకాదు. అటు పద్యమూ యిటు గద్యమూ కాని భావగీతాలు

విభూతి, రుద్రాక్షలు ధరించటం ముఖ్యం. గురుపాదోదకాన్ని మెడలో ధరించిన లింగంపై ప్రవహింపజేసి, ఆ తీర్థాన్ని తీసుకుంటారు. దేహ ప్రాణ పోషణకు ఉపయోగపడే పదార్థమే ప్రసాదము. గురువు ఆహారాన్ని స్వీకరించిన పిదప తదంశను అతని ఆజ్ఞతో భుజిస్తారు. శివజ్ఞానాన్ని కలగజేసి, నిత్యానంద సుఖాన్ని చవిచూపేదే మంత్రము. ఆ మహామంత్రమే 'నమఃశివాయ' అనేది. ఓంకార సహితంగానే యీ మంత్రాన్ని జపించాలి.

ఈ అష్టావరణలను ఆచరిస్తూ వీరశైవులు భృత్యాచార, సదాచార, గణాచార, లింగాచార మార్గాలను చేరుకుంటారు. తదనంతరం ఐక్యస్థలంలో వున్న మహాలింగంలో లీనమవుతారు. భక్త, మహేశ్వర, ప్రసాద, ప్రాణలింగ, శరణ, ఐక్యాది స్థలాలు షట్‌స్థలాలుగా పరిగణిస్తారు. లింగాంగ సామరస్యం వీరశైవానికి ప్రాణం.

స్థూలంగా చెప్పాలంటే భక్తి జ్ఞాన క్రియాదుల సమన్వయంలో భగవత్ప్రాప్తి కలుగుతుంది. ప్రారంభంలో ద్వైత భావము, క్రమంగా ద్వైతాద్వైతము. ధార్మిక జీవనము, నైతికవిలువల సాధనకై తపన, మానసికోన్నతికై పవిత్రంగా జీవించటం-యివన్నీ షట్ స్థల సిద్ధాంతంలో వున్నాయి.

వీరశైవ ధర్మాన్ని అనుసరించిన బసవేశ్వరుని వచనాల్లో మానవ ప్రకృతిని ఆవహించే దుర్బలత్వాన్ని జ్ఞానజ్యోతి ద్వారా దూరం చేసే ఆవశ్యకత గురించి నొక్కిచెప్పటం జరిగింది. "తత్తేనుకంపా సుసమీక్షమాణః"— అన్నట్లు దివారాత్రులు భగవత్కృప కొరకు నిరీక్షించడమే.

"నాథ్‌కృపాహీకో పంథ్ చిత్‌వత్ దీన్ హా దిన్ రాత్"—

భక్తి నిర్వహణలో తను, మన, ధన ప్రాణములను సైతం లెక్క చేయకూడదు. శాస్త్ర, పురాణ, వేదాంత, సంగీతశాస్త్ర జ్ఞానమున్నా ఫలము లేదు. నిజమైన భక్తిలో హృదయపూర్వకంగా భగవత్పూజ చేయవలసి వుంటుంది.

నిజమైన భక్తుడెలా వుండాలో బసవేశ్వరుని మాటల్లో-
'బ్రహ్మ పదవియునొల్ల - విష్ణు పదవియునొల్ల
రుద్ర పదవియు నొల్ల

"ఓ రంగనాథ పాదుకా ! ''ఈ అల్పకవి నా ప్రస్తుతి చేయటానికి అతి సాహసంతో పూనుకున్నాడు'' అని నవ్వుకుంటున్నావేమో! నేను తుచ్ఛుడనే కానీ, నాలో లేశమాత్ర ప్రతిభ కూడా లేకపోయినా నీ గొప్పతనానికేమీ అడ్డురాదు. నేను నా మూర్ఖత్వంవల్ల నీ పట్ల నా గౌరవాన్ని మాటల్లో తెలుపజాలకపోయి యే అపశబ్దం పలికినా, నీ ప్రతిభకవి ఏమాత్రమూ అడ్డురావు. ఎందుకంటావా 'భగవతి' అని పిలువబడే గంగానదీమతల్లి జలాన్ని యే శునకమో ముట్టినా ఆ పుణ్యఫలంవల్ల శునకానికి పుణ్యలోకప్రాప్తి అవుతుందిగాని ఆమె బిరుదానికి యేమి లోటు వస్తుంది ? నీ ప్రతిభా విశేషాలను నాకు చేతనయిన భాషలో పొగిడిన కారణంగా నాకూ అలాంటి పుణ్యప్రాప్తి లభిస్తుందేకానీ నేను నా ఆతృతతో ఏ అపశబ్దము పలికినా నీ అసమాన ప్రతిభాసంపత్తికి నిరోధము కలుగ''దని వేదాన్తదేశికుల అభిప్రాయము.

కేవల వినయమే కాదు, ఆత్మవిశ్వాసము కూడా భక్తునికి అవసరమే.

జంబూద్వీప నవఖండ పృథ్వియొళగి కేళరయ్యా
ఎరడళిన భాషయ
కొలువెనంబ భాష దేవనదు
గెలువెనంబ భాష భక్తనదు
సత్యవెంబ కూరలగనె తళెదుణందు
కూడల సంగమదేవా!''

"జంబూద్వీప, నవఖండ, పృథ్వీ మొత్తము ఎచ్చటికి వెళ్ళి విచారించినా ప్రచారంలో ఉన్న భాషలు రెండే రెండు. 'నన్ను కొలుచు' అన్నది భగవంతుని వాక్కు. 'నేనే గెలిచాను' ఇది భక్తునిది. సత్యమన్న ఆయుధం ఆధారంగా భక్తునిదే గెలుపు యెప్పుడూ."

నిజమైన భక్తుడెలా ఉండాలో ఈ క్రింది వచనంలో బసవణ్ణ అభిప్రాయ మిది-

''న్యాయనిష్ఠురి, దాక్షిణ్యపరను నానల్ల
లోకవిరోధి, శరణ నారిగంజువనల్ల
కూడల సంగమేశ్వర రాజతేజ దల్లిల్లనాగి''

రూపాన వుండటం వల్ల, పార్వతీదేవి పరమేశ్వరుని అర్ధాంగి అవటం వల్ల తమ తమ ఘనతలను కోల్పోతున్నారట ! ఆశ్చర్యకర విషయమేమిటంటే, ఆఖరికి మహేశ్వరుడు సైతం కూడల సంగమేశ్వరుని భక్తుల హృదయపు మూలల్లో దాగివుండటం వల్ల తన గొప్పతనాన్ని కోల్పోతున్నాడట !' చెప్పవచ్చే దేమిటంటే, భక్తుడే భగవంతుని కన్నా గొప్ప అని. ఇదే బసవణ్ణ మానవతా వాదానికి మూలాధారం. శివునికే మనసులో స్థానమివ్వగలిగే భక్తుడు అల్పుడుకాడు, క్షుద్రుడు కాడు, భ్రష్టుడు కాడు. అతడే అందరికన్నా వున్నతుడు. ఈ ఆత్మ విశ్వాసమే బసవణ్ణ వూపిరి. ధార్మిక, రాజకీయ, ఆర్థిక, సామాజిక, అరాజకాలు యెక్కువగా వున్న ఆ రోజులలో ప్రజలకు సంజీవినిలా దొరికిన మహాసంపద బసవేశ్వరుడు. మానవతలో అపార విశ్వాసమున్న దాతనికి. కృత్రిమ సమాజపు కుటిలనీతి వల్ల మానవుల మధ్య భేదాభిప్రాయాలు జాతి, కుల తత్వ ప్రచారాలు విస్తృమవుతున్నాయంటాడు. ఈ కుటిల నీతిని భేదించేటందుకు కంకణ ధారియై నిలుచున్నాడు. ''మానవుడే మహనీయుడు. ఆ దృష్టి అలవరచుకున్నపుడే ప్రపంచం వినూత్న కాంతితో ప్రకాశిస్తుంది. దీన్ని శాస్త్రం ఒప్పుకోనీ, ఒప్పుకోకపోనీ, హృదయం ఒప్పుకుంటే చాలు. దీనికి హృదయ హీన శాస్త్ర మవసరమా! శాస్త్ర రహిత హృదయ మవసరమా ! మత గ్రంథాలు అవసరమా ! మానవ ప్రేమ అవసరమా !'' అంటూ గద్దించి ప్రశ్నించాడు. భక్తులమధ్య భేదాలు వుండకూడదు. భక్తుల ముఖదర్పణంలో శివుడే దర్శనమివ్వాలి. భక్తులున్నచోటే దేవలోకం. భక్తులున్న చోటే వారణాశి. అదే కైలాసం. ఇంత ఉన్నత స్థానం భక్తునికి యివ్వడం సాధ్యమా ! ఇదికూడా చాలదు. అందరూ సత్యవాదనతో పరస్పర అనురాగంతో మెలగాలి. అప్పుడే అది సాధ్యమవుతుంది.

'సర్వరూ రుద్ర గణం గళింబె ! సర్వరూ సద్భక్తిరింబే'—

ధార్మిక మూఢాచారత్వం, బాహ్యాడంబరాల పటాటోపం, యెక్కువగా వుండేది. ఈ పరిస్థితిలో జనులలోని యీ మూఢాచార భక్తిని తొలగించాలన్న అకాంక్ష బసవేశ్వరునివంటి సామాజిక ఉద్ధార కర్తలకు కలగడంలో ఆశ్చర్యం లేదు. అప్పుడే 'జంగమారాధన' అన్న పద్ధతిని కనిపెట్టాడు. జంగమ పూజ పూర్తిగా వ్యక్తిగతం. సామూహికంగానూ యేకాంతంగానూ చేయవచ్చు. గురు పూజ, లింగధారణ, జంగమారాధన - యివీ బసవేశ్వరుని నిత్యకర్మలు. లింగ

సామాజికంగా, రాష్ట్రీయపరంగా ఎన్నో మార్పులు తీసుకురావాలని ప్రయత్నించాడు బసవణ్ణ. వ్యక్తి మానసిక వికాసానికి అవసరమయ్యే ఎన్నో బోధనలు చేశాడతను. భార్యాభర్తలిరువురూ సమానులే. ఇరువురూ సచ్చరిత్రము, శీలము, ఉత్తమనీతి అలవరచుకోవాలట! వ్యక్తే రాష్ట్రమట! మానవులందరూ కలిసి మెలసి జీవిస్తేనే రాష్ట్ర ప్రగతి. సర్వసమాన భావన బసవేశ్వరునిది. సామాజికంగా సమానత్వం రావాలంటే ధనికులు-పేదలు అన్న భేదాభిప్రాయాలు నశించాలి. తాను రాజు భండారాన్ని సంరక్షించే సమయంలో బొక్కసంలోని ధనమంతా పేద, ధనికులన్న భేదాలు లేక శివభక్తుల కోసం, వారి సేవకోసం వినియోగించాడు. బొక్కసం ప్రజల సొత్తు. దాన్ని అనుభవించేందుకు అందరికీ అధికారమున్నదట!

'వాచ మర్థోనుధావతి' అని కాళిదాసన్నట్లుగా, బసవణ్ణ మాటల కోసం తడుముకున్నది లేదు. అతని మనసులో భావాలు సందడిస్తే చాలు, భాష తనంతతాను దూసుకొని వస్తుంది. ఆధ్యాత్మిక తత్వాచరణలో తనకు అనుభవానికి వచ్చిన ప్రతి విషయాన్నీ దాచుకోకుండా భక్తుల ముందుంచి, వారిని జాగరూకులుగా చేయాలని ప్రయత్నిస్తాడు. అతడు తన భాషలో వినయానుసంధానం చేయగలడు. ప్రపంచాన్ని సైతం ఎదురొడ్డి నిలువగలడు. సద్భక్తిపరాయణతను ప్రకటిస్తూ 'స్వామీ నీను, శాశ్వత నీను' అంటూ తనంతతాను ఒదిగిపోయి చెప్పగలడు. బాహ్యాచారాలకు ప్రాధాన్యమిచ్చి, కుల మత తత్వాలను రెచ్చగొట్టే వారిపై విశ్వరూపం దాల్చి వారిని మట్టుపెట్టనూ గలడు.

ఒకమారు ప్రేమతో మాటలాడే స్నేహితునిలా, మరొకమారు ఆధ్యాత్మిక తత్వాన్ని బోధించే గురువుగా, ప్రకృతిలోని అందచందాలలో మానసిక విశ్లేషణను చేసే సాహిత్యకారునిలా, సకల చరాచర ప్రపంచంలోనూ పరమేశ్వరుని ప్రతిబింబం చూసే తాత్త్వికునిలా జగమంతా తానై నిండిన విరాట్‌స్వరూపుడైన భక్తిసామ్రాజ్యాధిపతిగానూ, ఇన్ని రూపాలలో సాక్షాత్కార మివ్వగలిగిన బసవేశ్వరుడు కన్నడ సాహితీ సరస్వతికి తలమానికం.

2)

# "చందమామ"ను సంభావించిన చందాలు

చందమామకూ మనసుకూ చాలా దగ్గరి సంబంధం వున్నది. చంద్రమా మనసోజాతః చక్షు స్సూర్యోఽజాయత- అని పురుష సూక్తంలో చెప్పినట్లుగా నిజానికి మానవునిలో కలిగే అనేక భావాలు, సంచలనాలు, అనుభూతులు, అన్నింటికీ మనసే కేంద్రస్థానం. కొంచెం సున్నిత మనస్కులయితే ప్రతిదానికీ చలించిపోతారు. అలాంటపుడు ఆ భావోద్వేగంలో ప్రకృతివైపు దృష్టి సారించటం జరుగుతుంది. తనలోని భావమే ప్రకృతిలోని అణువణువునా నిండిపోయినట్లే వుంటుంది. ఆనందాంబుధిలో మునిగిన వానికి ప్రపంచంలోని సెలయేళ్ళు, జలపాతాలన్నీ ఆనందపు పరవళ్ళు త్రొక్కుతున్నట్టుగా, శరద్రాత్రిలో అందగాడైన చందమామ తన చుక్కల చెలులకు తన వెన్నెల సంగీతాన్ని వినిపిస్తున్నట్లుగా, యింకా యేదోయేనోగా అనిపిస్తుంది. దుఃఖితుడైన వ్యక్తికి ప్రపంచమంతా యేదో బాధలో మునిగినట్లూ- యెక్కడ చూసినా నిరాశా నిస్పృహలు పేరుకుపోయినట్లూ అనిపిస్తుంది. యిలా ప్రతి అనుభూతిలో ప్రతి మలుపులో మనిషికితోడుగా నిలిచేది ప్రకృతే. ముఖ్యంగా ప్రకృతి సౌందర్యంలో 'చందమామ' ఆకర్షించినంతగా మరి యే వస్తువూ ఆకర్షించలేదేమో ! గొప్ప గొప్ప కళాకారులు మొదలుకొని సామాన్య మానవుని వరకూ వెన్నెల అందాన్ని తనివితీరా గ్రోలని వారే వుండరు. ప్రాకృత సాహిత్యం మొదలు ఆధునిక సాహిత్యం వరకూ సుధాంశుని వూసు చెప్పని చోటే లేదు.

స్త్రీకి మొట్ట మొదటినుంచీ సాహిత్యంలో ప్రాధాన్యత యివ్వటం జరుగుతూనే వుంది. ముఖ్యంగా విరహవర్ణన విషయంలో నాయకుని ప్రత్యక్షంగానో లేక పరోక్షంగానో- చూసి, లేదా అతని గుణశీలాదులను వినో- అతనిపై మరులుగొని నాయికపడే విరహవేదనలో 'చంద్రోపాలంభా'నికే యెక్కువ ప్రాధాన్యం. ఈ నాయికా నాయకుల వృత్తాంతమేమీ తెలియని అమాయకుడైన చందమామ- తన కర్తవ్య నిర్వహణేమో తానేమో అన్నట్లున్న యితడు-అన్యాయంగా యీ సుందరీమణుల నోట యెన్నెన్ని తిట్లు తిన్నాడో చూస్తే జాలివేయక పోదు.

దేవతలూ నిన్ను మ్రింగుతారన్నది. "త్రిపురాసుర సంహారవేళ రుద్రుడు నిన్ను తన రథచక్రంగా చేసుకోవడానికై నీ దేహములో బెజ్జము వేశాడు గదా! రోహిణీ సంభోగము వలని యపథ్యముతో ఆ బెజ్జపు గాయము సెలవేసి నీవు ఆ దోషమువల్ల మరణించలేదెందుకని'' చెడతిట్టింది. ఇంకా చూడండి:

''గోవధము సేయు తురకల దైవంబవు నీవు మొదల దక్కక పాంథ
స్త్రీ వధము సేయ రోయుదె, నీ వర్తన మేమి చెప్ప నీరజవైరీ!''

'గోవధ చేసే మహమ్మదీయుల దైవమయిన నీకు స్త్రీ వధ అసాధ్యమా?' అన్నది. (ఈ కందములో పెద్దన ఆనాటి రాజకీయ పరిస్థితులను బాగా వాడుకున్నట్లుగా తోస్తున్నది.) ఇంతటితో పోనిచ్చిందా? ''నీ యోగ్యత తెలియక శివుడు తలపై అలంకారముగా వుంచుకున్నా''డంది. "తెలిసినపుడు దక్షయజ్ఞ సమయములో వీరభద్రరూపములో నిన్ను కాలి క్రింద వేసి త్రొక్కినా మొండి ప్రాణాలతో బ్రదికేవున్నావే'' అని ఆశ్చర్యం ప్రకటించింది.

''ఖలుడు, ఘాతకుడు, మహోగ్రుడు, దుర్జాతివాడు'' అన్న నాగరికపు తిట్లేగాక, కొరివి దయ్యమని గూడా తిట్టించుకున్నాడు దమయంతి చేత, హాలాహల ద్వయము జలధిలో పుట్టినపుడు, వానిలో ఒక విషమును ఒక వేలుపు మ్రింగాడు. ఈ రెండో విషాన్ని మ్రింగక విడిచిన పాపానికి యెంతమందిని హింసిస్తున్నాడో చూశారా! అంటున్నది. కోపము పట్టలేక చంద్రుని హత్య చేద్దాం రమ్మని చెలులను పిలుస్తున్నది. అలా అంటే విని పారిపోగలడని పొంచి, కాచి మరీ దెబ్బ వేయండని హెచ్చరిస్తున్నది.

తే. ప్రాణసఖులార, వెన్నెల బయలికిపుడు
మించుటద్దంబు గోలయుగొంచు రండు
చోరుడల చంద్రుడద్దంబు సొచ్చినపుడు
వంచనము లేక వ్రేయుడీ పొంచి యుండి—

శృంగార నైషధము - ద్వితీయాశ్వాసము.

ఇన్ని మాటలాడినా తొణకక బెణకక నిలచివున్న చందమామతో సంధి కార్యానికి దిగుతోంది చూడండి. ''పార్వతీపతికి అవతంసంబవు. దుగ్ధాంబోధికి

విరహతాపంలో ఒడలు తెలియక వెన్నెల మండుతున్నదని అభియోగము మోపుతున్న నాయికతో ఆమె చెలికత్తె అంటున్నది.

''పండువెన్నెలలు నీపై గాయగానీ
కెండలాయె నంటూనేల తిట్టేవే
నిండిన చందురుడు నీకునాతనికి
కొండుక సాయము రూపుకూడ పెట్టెనటవే''-

చల్లగా కాయుమని చంద్రుని వేడుకుంటూంది ఓ సుకుమారి.

''ఏకాంత సుఖ గోష్టినింపొంద మానవా
నీకంబులెడ గలిసి నిలిచి సేవింప గాం
తాకదంబముల హస్తముల కంకణము ఝణ
త్కారములు నిగుడ జాపురము లిడగ
జోకైన మణిగణ స్తోమాంకితంబులై
పొంపొందు నాలవట్టములు గరముల దాల్చి
యేకాంతులిరువంక నెదిరి కొలువంగ సకల
లోకేశ్వరుడు మెరియగాను
చల్లగా కాయగదో చందమామ!''

ఎంత తీయని భావన!

జలజములకూ, చంద్రునికీ బద్ధవైరమని లోకవాదమైనా యిక్కడ ఆ రెండింటి స్నేహమునూ యెలా సమర్థిస్తున్నాడో చూడండి.

''జలధిలో జనియించి చందురుడె పగలాయ
జలజములకు నేటి శాంతములే
మెలకమోమై నేడు మెత్తని కరతలము
జలజాన బవళించె జక్కని చందురుడు''—

క్షేత్రయ్య పదాలలో కూడా యింతటి రాసిక్యత వున్నా ప్రకృతిపై యెక్కువ దృష్టి సారించినట్లు లేదు.

ప్రౌఢనాయిక అయిన యీవిడ విరహోత్కంఠిత, ఈమెకు వెన్నెల కాకలు. చిలుకల పలుకులు అన్నీ బాధాకరములే. ఒంటిగా వుండే కంటికి నిదుర

"పదరక పోపోవే-వాడేల వచ్చీనీ
వద్దు రావద్దనవే-కూడి యున్నది చాలునే
అది ఒక్క యుగము వేరే జన్మము-ఇపుడు
అతడెవ్వరో నేనెవరో ఓ చెలియ.
నిచ్చనిచ్చల నేడే వచ్చీని రేపైన-వచ్చీసనుచు మదిలో
విచ్చగా పలు వేడి నిట్టూరుపులచేత-నింతిలో పెదవులెండి
హెచ్చయిన వెన్నెల చిచ్చు రాత్రులు
యెన్నెన్నో గడిపితి నిక నేటి మాటలే."

విరహోత్కంఠిత అయిన యీ స్వీయ నాయిక ప్రౌఢ. ఎంతో కాలము నుండీ ఆమె చెంతకురాని నాయకుడు యిప్పుడు వస్తానని చెలికత్తెతో చెప్పి పంపగా వద్దు, రావద్దని చెప్పి పంపుతున్నది. నేడు వచ్చేను-రేపు వచ్చేనని యెదురుతెన్నులు చూస్తూ పలు వేడి నిట్టూరుపులచే పెదవులెండి, హెచ్చయిన వెన్నెల చిచ్చురాత్రులు యెన్నెన్నో గడిపితినని చెబుతున్నది. ముందుముందు, నెలతించి కలకంఠ పికనాదములు, మధుమాసములు గడిపితినని, శకునము లడిగితినని, కామించి నాథుల కలియు తక్కిన చెలుల జూచి కరగి నీరైతినని చెబుతూ, యిన్నాళ్ళుగా మనసులేని నాయకునికీనాడు తనపై కలిగిన యీ అకారణ ప్రేమ నాకు అక్ఖరలేదు పొమ్మంటున్నది.

ఇక జానపద సాహిత్యంలోనూ చందమామ ప్రాముఖ్యం చాలానే వున్నది. "చందమామ రావే, జాబిల్లి రావే''- అని తల్లి తన కొడుకుకు వెండిగిన్నెలో వెన్న పట్టుకుని పసిడిగిన్నెలో పాలు పోసుకొని వెన్నెల్లో ఊసులు చెబుతూ తినిపించేటప్పటి నుంచి అతనితో దోస్తీ యెక్కువవుతుంది. అప్పటి అందాల చందమామ, చల్లటి చందమామ పెరిగి పెద్దై ప్రణయంలో పడ్డాక వేడి చంద మామగా మారిపోతాడు ప్రేయసి అందమైన రూపాన్ని తలచుకుంటూ వియోగులు విడిచే వేడివేడి నిట్టూరుపులకు అప్పటి చల్లటి వెన్నెల కాస్తా వేడి వెన్నెలగానూ మారవచ్చు. తన మనోమోహినిని తలచుకుంటూ ఆనందంలో మునిగే ప్రియునికి ఆ చల్లటి వెన్నెల స్పర్శ, నులివెచ్చని ప్రేయసి హస్తస్పర్శగానూ తోచవచ్చు. నిజానికీ ప్రణయంలో పడ్డాక చందమామతో రాయబారాలు, పరాచికాలు, రహస్య మంతనాలు...అబ్బో...ఒకటేమిటి? స్నేహం యెక్కువైపోతుంది.

కల్లగాదీ మాట, నల్లనయ్యతో జెప్పు రంగధామ
ఈలాటి కాపురము యెన్నాళ్ల జేతును చందమామ"—
అని తనకు న్యాయం చేయమని నిలదీస్తున్నది.

"కూడుగుడ్డ వుంటే కోరిక తీరున
పండువంటి మగడు పక్కనవుంటే చాల"ని తానే తేల్చిపారేసింది చివరకి. ఈ పల్లెటూరి పిల్ల చాలా చాతుర్యం గలదిగా కనిపిస్తున్నది. తనకూ తన మామకూ మధ్య తగాదా తీర్చమని పెత్తనం యిచ్చినట్టే యిచ్చి - 'అ...నీ వేమి చెప్పే దంటూ' ఆ కార్యమూ తానే చేసింది.

ఇక కర్ణాటక సంగీతంలో చందమామ పేరుతోనే అనేక రాగాలున్నాయి. బాల చంద్రిక, పూర్ణచంద్రిక, గాన చంద్రిక, శీతకరణి, చంద్రకిరణి, శర ద్యుతి, చంద్రజ్యోతి - యిలాంటి రాగాలున్నా వానిలో ఒకటి రెండు తప్ప తక్కిన రాగాల స్వరూపాలు తెలియరావటం లేదు. అయా రాగాలను సృష్టించిన మహామహులకు ఆ రాగ రచనకు కలిగిన ప్రేరణలేమిటో యీనాటి పరిశోధకు లకు తెలియటం లేదు. పూర్ణచంద్రిక, చంద్రజ్యోతి, మొ॥ కొన్ని రాగాలు మాత్రమే యిప్పుడు ప్రచారంలో వున్నాయి. 'నా అక్షరాలు వెన్నెల్లో ఆడు కుంటున్న ఆడపిల్లలు'- అన్నాడొక ఆధునిక కవి. అలాగే అయా రాగ నిర్మాత లకూ ఒక తీయని వెన్నెల రేయిలో హాయిళ్లు ఒలకబోస్తూ పగలబడి నవ్వుతూ తీయని మాటల పన్నీటి జల్లులు కురిపిస్తూ తిరిగే కన్నెపిల్లల్లా ఆ రాగ కన్ని యలు కన్పించి వుండవచ్చు. ఆ సుందరీమణులను చూచిన క్షణాన వారి అను భూతిని రాగాలాపనల ద్వారా శాశ్వతం చేయాలని వారు చేసిన ప్రయత్నమే ఆ రాగ స్వరూపమని అనుకోవచ్చునేమో!

పాశ్చాత్య సంగీతంలో యిలాంటి పద్ధతి వున్నది. వివిధ ఘట్టాలలో తమకు కలిగిన భావానుభూతిని కేవలం వాద్య సంగీతం ద్వారా వెలికి తీసుకు వచ్చే సంప్రదాయమది. 1770 వ సంవత్సరములో డిసెంబర్ 16 న జన్మించిన లూడ్విగ్‌వాన్ బీతోవెన్ ఇలాంటి రచన లెన్నింటినో చేశాడు. అతడు ప్రకృతి సౌందర్యోపాసకుడు. ప్రకృతిలో యే దృశ్యాన్ని చూచినా దానికి పులకరించి పోయే సున్నిత మనస్తత్వ మాతనిది. ఆ పులకింత నుండే ఒక మధురస్వర

# రచనా త్రివిక్రముడు-ప్రేమ్‌చంద్

"హిందీ భాష ప్రేమ్‌చంద్‌కు యెంతో ఋణపడి వున్నది. ఈ యుగ సాహిత్యంలో-ప్రత్యేకంగా కథా సాహిత్యంలో-అందమైనది, ఉద్బోధకమైనది. సంవేదనశీలత, ఉదారత - యీ గుణాలన్నీ కలగలసిన జీవత్వం-ప్రేమ్‌చంద్ ద్వారా ప్రాప్తించినదే. ఆయన మరణించిన సమయాన హిందీ సాహిత్యం ఒక గొప్ప కథారచయితను కోల్పోయింది. ఆయనకు వ్యక్తిగతంగా, రచనాపరంగా సమీపానికి వెళ్ళిన మాకు, మా అగ్రజుణ్ణి, మా మార్గదర్శకుణ్ణి కోల్పోయిన బాధ-యెల్లలు లేనిది''—ఈ మాటలు హిందీ సాహిత్యంలో మరో ప్రముఖ రచయిత అయిన బాలకృష్ణశర్మ 'నవీన్' గారివి. నిజమే. హిందీ సాహిత్య రంగంలో అన్ని వర్గాల పాఠకుల మనసులనూ చూరగొన్న వాస్తవిక రచయిత ప్రేమ్‌చంద్ అంటే అతిశయోక్తి కాదేమో !

సమాజంలో వివిధ రకాల మానవ సంబంధాలు మనకు కనిపిస్తాయి. వాటిని తీవ్రంగా పరిశీలించి సమాజాన్ని అవగాహన చేసుకొనే సామర్థ్యం కొద్ది మందిలోనే ఉంటుంది. ఈ దృష్ట్యా ప్రేమ్‌చంద్ వంటి పరీక్షకుడు, వాటి చిత్రీకరణలో ఆయనకంటే సఫలమైన రచయితా ఒక సాహిత్యానికి ప్రాప్తించటం దాదాపు దుర్లభమే. తన రచనలన్నింటిలోనూ సమాజ చిత్రీకరణకై ఆయన ప్రయత్నించారు.

స్వాతంత్ర్య సమరానికి పూర్వం అప్పటి పాలకుల దౌర్జన్యాన్ని కేవలం చూడటమే కాదు, ఆయన అనుభవించారు కూడా. ఆయన సాహిత్యంలో ప్రవేశం చేసినప్పటికే స్వతంత్ర సాధనకు ఆందోళన మొదలైవుండింది. గాంధీజీ నేతృత్వంలో యీ ఆందోళన ప్రారంభమైంది. గాంధీజీ సూక్తుల ద్వారా ప్రభావితులైన ప్రేమ్‌చంద్ సాహిత్యం కూడా గాంధేయ వాదాన్నే బలపరచింది. సమాజంలోని కుటిలనీతిని, దౌర్జన్యపు దురాగతాలను, ఆశయసిద్ధికోసం జీవితాలను సైతం త్యాగం చేయటానికి వెనుకాడని త్యాగధనుల వ్యక్తిత్వాలను, సమాజాన్ని పట్టి పీడిస్తున్న అస్పృశ్యత - ఇలాంటి యెన్నో సమస్యలను తన సాహిత్యంలో చిత్రీకరించారాయన.

కారుల కోపానికి బలికావటమే దీనికి ప్రబల తార్కాణం. తన ముప్ఫై యేళ్ల రచనా జీవితంలో ఆయన పది నవలలు, దాదాపు మూడు వందల కథలు, కొన్ని నాటకాలు, అసంఖ్యాకమైన వ్యాసాలు వ్రాశారు. 1905-1936 మధ్య ఇటు జాతీయ రంగంలోనూ, అటు అంతర్జాతీయ రంగంలోనూ జరిగిన ఘటనాపరం పరపై సామాజిక రాజకీయ ప్రభావం యెక్కువగా కనిపిస్తుంది. ఈ ఘటనలు ఆయనపై చూపిన ప్రభావం కూడా మనకు స్పష్టంగా కనిపిస్తుంది. ఈ సంఘట నల పట్ల ఆయన కేవలం సాక్షీభూతుడుగా లేరు. వాటిలో పాల్గొన్నారు. బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా సహాయ నిరాకరణోద్యమం సాగిన దశలో ప్రేంచంద్ తన స్కూళ్ల యిన్‌స్పెక్టర్ వుద్యోగానికి రాజీనామా యిచ్చేశారట. ఆనాటి దేశ పరిస్థితులను చూచి ఆయన అనుభవించిన ఆవేదనే ఆనాటి రచనల్లో తొంగి చూస్తుంది.

ఇక ఆయన రచనా విధానాన్ని పరిశీలిద్దాం. ప్రేంచంద్ యదార్థవాది. మనో విశ్లేషణలో మంచి దిట్ట. తన రచనల్లో యేదో ఒక సందేశాన్ని యివ్వటం ఆయన అలవాటు యదార్థ చిత్రణతోపాటు ఆదర్శంవైపు పాత్రలను నడిపించటం ఆయన రచనలలోని విశేషం. అవసరాన్ని బట్టి మానవ మనోభావాలను వర్ణిం చటం కూడా కద్దు. హృదయ పక్షము, బుద్ధి పక్షము- యీ రెండింటినీ సమానంగా పోషించగల రాయన. వర్తమాన పరిస్థితులను యెంతో సహజంగా చిత్రించటం ఆయన కలం సామర్థ్యం. ఆయన ముఖ్యంగా గాంధేయవాది. ఆదర్శ వాదాన్ని కూడా జోడించి రచనలు చేశారు. కొన్ని రచనల్లో మార్క్స్ ప్రభావం కూడా కనిపిస్తుందాయనలో. దేశానికి తగిన ఆహార ధాన్యాలను అను దినం శ్రమించి అందించే రైతులు, దేశానికి తగిన ఆర్థిక సహాయాన్నందించే పరిశ్రమల వెనుకనున్న శ్రమజీవులు - మొదలైన వారి జీవితాలలోని ప్రగతి-ప్రగతి యేమిటి ? కష్ట నష్టాలేమిటి ? ఏమి జరుగుతున్నదో వర్ణించి, అలా యెందుకు జరగాలో ప్రశ్నించి, ఏమి జరగాలో తెలియజేసి, అలా యెందుకు జరుగవలసివున్నదో తెలియజెప్పా రాయన.

ఇక ఆయన యెన్నుకున్న కథా వస్తువులలోని వైవిధ్యాన్ని పరికిద్దాం. గ్రామీణ వాతావరణానికి సంబంధించిన కథా వస్తువునూ కూడా యెన్నుకున్నారు. పరిశీలనాతత్పరుడైన ప్రేంచంద్ దృష్టినుంచి యే చిన్న విషయమూ తప్పించు

బయట పెట్టటానికి వీల్లేకుండా శరపరంపరగా వచ్చిపడే సంఘటనలు, పాత్రలను ఊపిరి పీల్చుకోవటానికి కూడా వీలుకల్గించని రీతిగా సాగిపోయే కథా కథనం - లదితర సర్వలక్షణ సమన్వితమైన రచనలంటే ఆయనకు పరమ ద్వేషం. అటువంటి రచయితలను యే మాత్రం దయాదాక్షిణ్యాలు లేకుండా ఖండిస్తారాయన. 'సాహిత్యం సమాజానికి దర్పణ' మంటారాయన.

ఒకసారి ఆయన మూఢాచారాలను, మూఢ నమ్మకాలను ఖండిస్తూ అన్నారు—''ఈ 'మతతత్వం' అన్న పదం యెప్పుడూ సంస్కృతి అన్న ముసుగు వేసుకునే దర్శనం యిస్తుంది. అది తన అసలు రంగును యెప్పుడూ బయట పెట్టదు. సింహం చర్మం కప్పుకుని పరిపాలించాలనుకునే గాడిద లాంటిదది. ముస్లిములు తమ సంస్కృతిని కాపాడుకోవాలనే ప్రయత్నిస్తారు. కానీ యీ 'సంస్కృతి' అన్నది హిందువుల కొకటి, ముస్లిముల కొకటి- యిలా వేరువేరుగా లేదు. అంతా ఒకటే- మానవ సంస్కృతి. అందరికీ ఒకటే నాగరికత. ఆర్థిక నాగరికత. సంస్కృతికి మతంతో సంబంధం లేదు.''— ఒక విధంగా ఆలోచిస్తే ఆయన అభిప్రాయం నిజమేనేమో అనిపిస్తుంది. ప్రజల శ్రమే సంస్కృతికి మూలం అన్న విషయం ఆయనకు తెలుసు. ప్రేంచంద్ నవలల్లో భారతదేశం యొక్క వుమ్మడి సంస్కృతి స్పష్టంగా చిత్రించబడింది. భారత ప్రజల ఐక్యత పట్ల ఆయన భావాలకు యిది ప్రతీక. కానీ యీ వ్యాసాలను చదివి ఆయన భార్య ఆయనకు విజ్ఞప్తి చేసింది.— ''యీ విధంగా మతం, కులం అన్నీ అబద్ధాలంటూ వ్రాసి ప్రజలను నొప్పించి వారి విరోధాన్ని కొనితెచ్చుకునే వ్యాసాలు వ్రాయ వద్ద''ని. అయితే ప్రేంచంద్ ఆమెకు యిలా సమాధానమిచ్చారు.— ''అటు ప్రజలూ, యిటు ప్రభుత్వమూ యిద్దరూ కూడా రచయిత తమకు పనిముట్టుగా వుండాలనుకుంటారు. కానీ ఒక్క విషయం. ఇతరులు ఆదేశించినట్లు రచయిత వ్రాయటం ప్రారంభిస్తే అతడు 'నిజమైన రచయిత' అనిపించుకోడు. రచయితది నిజానికి చాలా క్లిష్టమైన పరిస్థితి. అతడు తన రచనల ద్వారా ప్రభుత్వాన్ని నొప్పిస్తే జైల్లో పెడతారు. ప్రజలను బాధపెడితే, వారు కొడతామని బెదిరిస్తారు. అటువంటపుడు- రచనా వ్యాసంగానికి స్వస్తి చెప్పడం ఒకటే మార్గమా! లేక వారినుండి వాస్తవాన్ని దాచిపెట్టి, అందమైన కలలను చూపించి, జోకొట్టి నిద్ర పుచ్చటమా! కాదు. మానవత్వమున్న మనిషిగా సాంఘిక బాధ్యతగల వ్యక్తిగా,

మారుస్తుంది. ఆ పరిస్థితిలోనే వాళ్ళిద్దరూ 'పని'నే బహిష్కరిస్తారు. వారి యీ చర్య తిరుగుబాటు ధోరణికి క్రాంతిపథం వైపు పయనానికి ప్రతీకగా చిత్రీకరించబడింది. ఇంతేకాదు, ఈ ఆవేశంలో వారు చావు బ్రతుకులలోవున్న యింటి కోడలి 'కఫన్' (శవము మీద కప్పబడే బట్ట) కోసం దాచిన డబ్బును కూడా ఖర్చుచేస్తారు. ఈ కథ ద్వారా ప్రేంచంద్ చూపించిన నీతి యేమిటి? పలాయన వాదం తప్పు! అని కొందరి ప్రశ్న. కానీ ఈ కథలో గొప్ప మలుపు వున్నది. అది ఏమిటంటే- జమీందారులు, ధనవంతులు, యీ బీదవారు యిలాగే తమ కాళ్ల క్రింద వుంటారని కలలుకంటున్నారు. కానీ తమ కోరికలను తీర్చుకునేందుకు ఆ యింటి ఒకే ఒక్క కోడలు 'కఫన్' కోసం దాచిన డబ్బును కూడా ఖర్చు చేయటానికి వెరవని వారు, యిలాగే యేనాడో ఒకనాడు తమ కోర్కెలను తీర్చుకునేటందుకు, తమ హక్కులను పరిరక్షించుకునేందుకు జమీందారులనే యెదిరించేందుకు వెనుకాడరని ఆయన ఉద్దేశ్యం. నిజమే. కేవలం త్రాగడమన్న అతి చిన్న కోరికను తీర్చుకోవటం కోసం మానవతా రహితమైన చర్యకు పూనుకోవటం, యింకా యెంతటి తిరుగుబాటుకైనా తయారవటానికి నాందీయే గదా!

ఇక 'గోదాన్' ఆయన నవలల్లో అత్యుత్తమమైనది. అద్వితీయమైనది. అతివాస్తవమైనది. దానిలో కథానాయకుడు హోరీ. ఒక సామాన్యరైతు. సాధారణంగా రైతులు సహనశీలురు. తమ రక్తాన్నీ ధారపోసి, ఎండా, వానా, ఏవొచ్చినా జడవక, పంటను పండిస్తారు. కానీ దానివల్ల అతనికేమాత్రం ప్రయోజనం వుంటుందన్నదే యీ నవలలో కథాంశం. హోరీ కూడా సాధారణరైతే. ఎంతటి కష్టనష్టాలనైనా భరించగలిగే సహనం కొండంత వుంది. దానితోపాటు అతని జీవితాన్నే మింగే మూఢనమ్మకాలకు బానిస. తానేం చేస్తే చుట్టుపక్కల వాళ్ళు యేమనుకుంటారో, తానేం మాట్లాడితే యజమానికి కోపం వస్తుందోనని చచ్చేంత భయం అతనికి. ఈ పరిస్థితుల్లో జీవిస్తున్న హోరీకి చాలా రోజుల నుంచీ ఒకటే కోరిక- ఎలాగయినా ఒక ఆవును యింట్లో కట్టేసుకోవాలన్నది. అతడు రైతు రైతుగా ఆ కోరిక వుండటం అసహజమేమీ కాదు. కానీ, సాంసారిక చింత, బాధ్యతలు, కొడుకు గోబర్ వివాహ సమస్య యివన్నీ పీడిస్తున్నా- ఆవును పెంచుకోవాలన్న కోర్కెను మాత్రం చంపుకోలేకపోతాడు. ఈ చిన్ని కోరికను కూడా అతడు తన జీవితకాలంలో తీర్చుకోలేకపోతాడు. ఈ మాత్రం దానికి అతడు జీవితంలో యెంతగా అలమటించిపోతాడన్నదాన్ని, ప్రేంచంద్

మనుష్య సమాజంలో రెండే వర్గాలున్నాయి. మొదటి వర్గం పెద్దది. దీన దళిత వర్గాలవారిది. రెండువ భాగం ధనిక శోషక వర్గం వారిది. 'మహాజనీ సభ్యతా' అన్న రచనలోనే అంటారాయన- "మొదటి - పెద్ద భాగమైన శ్రమజీవుల-వర్గమే యే నాటికయినా గెలిచితీరుతుంది."

ప్రేంచంద్ సాహిత్య ప్రభావం తరువాత రచనలపైన యెంతయినా వున్నది. తెలుగులో కూడా ఆయనచే ప్రభావితులయిన రచయితలు కొందరున్నా రంటే అందులో ఆశ్చర్యం లేదు. ప్రేంచంద్ 'గోదాన్' లాగే తెలుగులో ఒక నవల వున్నది. అది ఉన్నవ లక్ష్మీనారాయణ గారి 'మాలపల్లి'- గోదాన్‌లో సాధారణ రైతు జీవితాన్ని చిత్రీకరించడానికి ప్రయత్నిస్తే 'మాలపల్లి'లో హరి జనుల జీవనానవిధాపై దృష్టి కేంద్రీకరించటం జరిగింది. ఇద్దరు రచయితలూ గాంధీజీ వల్ల ప్రభావితులైన వారే. దీనిలో యేమీ సందేహం లేదని విమర్శకు లంటారు. హిందీ సాహిత్యంలో శ్రమజీవుల కష్టాలను కథా వస్తువుగా యెన్ను కున్న మొదటి రచయిత ప్రేంచంద్. అలాగే తెలుగులో హరిజనుల దీనావస్థను వర్ణించబూనుకున్న మొదటి రచయిత లక్ష్మీనారాయణ గారే నేమో!

తెలుగులో ప్రేంచంద్ సాహిత్యం యెక్కువగా అనువదించబడ్డది. బహుశా యే హిందీ రచయిత రచనలూ యింత యెక్కువగా తెలుగులోకి రాలేదేమో! తెలుగేకాదు, అన్ని సాహిత్య రంగాలనూ ప్రభావితం చేసిన ప్రేంచంద్ త్రివిక్ర ముడు. శరత్ సాహిత్యంకూడా తెలుగులో బాగా ప్రచారం చేయబడింది. ఆయన వ్యక్తి నుంచి కుటుంబం, కుటుంబం నుంచి సమాజం వైపుగా తన దృష్టిని మళ్ళించి, మేధస్సును పెంపొందింప జేసుకునే అనుకూలం కల్పించారు. ఆయన రచనల్లో ముఖ్యంగా స్త్రీలకు ప్రత్యేక స్థానమున్నది. కానీ ప్రేంచంద్ దృష్టి అందుకు పూర్తిగా విరుద్ధం. సమాజం వైపునుంచీ కుటుంబం- వ్యక్తి యిలా పయనించి, వాస్తవ దృష్టిని పాఠకుల్లో కలిగిస్తారాయన.

క్రితం సంవత్సరం (1980)లో ప్రేంచంద్ శత జయంతి వుత్సవాలు బొంబాయిలో వైభవోపేతంగా జరుపుకున్నారు. ప్రఖ్యాత కళాకారుడు గులాబ్ దాస్ బ్రోకర్ గారు ప్రసంగిస్తూ యిలా అన్నారు: "నా కుమార్తె సాహిత్యం చదువుతూంది. ఇలా చంద్రజోషీ (ఆయనా ఓ ప్రముఖ హిందీ రచయితే) మా

# హేమంత సీమంతినీ విలాసం

అబ్బబ్బ...చలి...ఉహుహూ,...ఈ చలిలో హాయిగా ఇంట్లో దుప్పటి కప్పుకు పడుకుని వేడి వేడి కాఫీ తాగుతుంటే ఎంత హాయిగా ఉంటుంది! కానీ ఖర్మగాలి ఈ డైరీపాలకోసం తెల్లవారుఝామునే లేచి ఇలా వీధుల్లో పడిగాపులు గాస్తూ, అందమైన ఆ అనుభవాన్ని వదులుకోవలసివస్తూంది...ప్చ్...పట్టణంలో మామూల చిక్కటిచలిలో నుంచుని డైరీపాలకోసం పడిగాపులుగాచే ఓ సగటు మానవుని ఆరాటం. నిజమే. చుట్టూ మంచు తెరలు దించినట్టు అవతలి మనిషి రాక వినిపించడమేకాని కనిపించడం సాధ్యంకాదీ చలికాలంలో. అసలు ఏ దూర ప్రయాణాలకోసమో ఇలాంటి తెల్లవారుఝాముల్లో బయలుదేరినవాళ్ళకి రోడ్లలో మనుషులు తిరుగుతున్నదానికి గుర్తుగా చిక్కని స్వెట్టర్లూ, మెడచుట్టూ గట్టిగా బిగించిన మఫ్లర్లూ, వీలయితే చేతికి కూడా తొడుగులు, ఇవి చాలవన్నట్లు భుజాల చుట్టూ శాలువా-వీటన్నిటితో తిరిగే మనుషుల విగ్రహాలే యెక్కువ కని పిస్తుంటాయి. వీటన్నిటికీతోడు నోట్లో ఏ సిగరెట్ ముక్కతోనో ఇలాంటివాళ్లు నాలాంటి పిరికివాళ్ళకి ఎదురయ్యారనుకోండి. కెవ్వున కేకవేసి 'బాబోయ్, దెయ్యం దెయ్యం' అంటూ భయపడి మొదట కళ్ళు రెండూ గట్టిగా మూసుకో వడం, ఆపైన కంగారులో అస్తవ్యస్తంగా అడుగులు పడి ఏ గోడకో తగిలి ఎదురుదెబ్బ తగిలించుకోవడమూ ఖాయం. ఇలాంటి అనుభవాలు ప్రతి ఒక్కరికీ ఏదో ఒక చలికాలంలో కలగక మానవు.

నిజమే. శరదృతువు వెళ్ళి హేమంతం వచ్చే వేళకు చిరుచలి మొదలవు తుంది. 'ఇంతై వటుడింతింతై' అన్నట్లుగా పోను పోను విశ్వరూపాన్ని దాల్చి తెల్లవారుఝామున నిద్రను మరింత కమ్మగా చేస్తుంది. ఒక్కో ఋతువులో కొన్ని ప్రత్యేకాలంకారాలతో భూదేవి కొత్తరూపాలను దాలుస్తుంది. మార్గశిర, పుష్యమా సాల్లో హేమంతసీమంతిగా మారే ఆమె అందాలు లెక్కలేనన్ని. ఎటుచూసినా రంగురంగుల నవ్వుత్తో మసల్ని నిండుగా పలకరించే బంతులు-ముద్దబంతులు. 'హేమంతసీమంతిని'కి మేమంటే యెంత యిష్టమో తెలుసా' - అంటూ హుందాగా నవ్వే చేమంతుల శృంగారాలు, ''అందంలో మాకు సాటి యెవరు?

'ఫాలేయి అచ్ఛ భల్లం వ ఉ అహ కూగ్గామదే ఉల ద్దారే
హేమంత ఙం పహివో బిజ్జు అంతం పలాలగ్గిమ్ —
కాలసీహుడు (గాథాసప్తశతి-109)

''శీతకాలమందు చిన్న పల్లియ జూడు
దేవళంపు బయట దెరువుకాడు
కాలియాఱు నెండు గడ్డి మోపున గట్టి
గొట్ట జొచ్చె-నెలుగు గొడ్డు బోలె''—
(అనంత కృష్ణశర్మగారి అనువాదం)

ఈ శీతల హేమంతపు రాత్రి అందాలను అస్వాదిద్దామన్న ఆ కాంక్షతో చిరుచలిలో యింటి నుంచి బయటపడ్డ కాలసీహునికి ఓ చిన్ని దేవళము బయట చలి బాధ కోర్వలేక ఎండుగడ్డికో మంట వేసుకొని కాచుకుంటున్న పథికుడు కంటబడ్డాడు. అతను చేస్తున్న పనేమిటి? అప్పుడప్పుడు మంటగా చెలరేగుతూ ఆరిపోతున్న ఆ గడ్డి మోపు మంటను తన దగ్గఱున్న కఱ్ఱతో యెగవేస్తున్నాడట! మరి సగం కాలి వున్న ఆ గడ్డిమోపు యెలా వుంది? యెలుగు గొడ్డువోలె వున్నదట! యెంతటి సూక్ష్మ దృష్టి! యెంత అందమైన సృష్టి!

కవి దృష్టి చాలా నిశితమైనది. యే చిన్ని ఆధారం దొరికినా దాన్ని కవితా రూపంలో నయినా కథా రూపంలో నయినా మార్చనిది అతనికి నిద్ర పట్టదు. అలా నిరంతర పరిశీలనాశీలురయిన వినయాయితుణ్ణి, హేమంత ఋతువు నిద్రపోనీయలేదు. ఆ చిరుచలిలో పట్టణ వీథుల్లో పచార్లు చేస్తున్న కవి గారికి చలి బాధకోర్వలేని యీ పథికుని సణుగుడు వినబడింది కాబోలు-అతని బాధ నెంత హృద్యంగా వర్ణించాడో చూడండి.

'ఖంచగ్గిణా పీణేసు తేణీహం గామమ్మి రక్ఖివో పహివో
ణ అ ఖసివో ణతిజ్జులు సాసు సుయేణవ్వ సీయేణ'—
"పల్లెలందు గడ్డి పఱుపులు ద్రిమాని చో
దియల చిచ్చులడవి దెసల ద్రోచె,
పట్టణముల జూడు పాంథునిపై జలి
కసిని దీర్చుకొనెడు కరణిదోచు''—

అడవులెల్ల మంచు పూలతోనే విరగ బూచినట్లుతోచగా, తాను మేల్కొని గంట కావస్తున్నా తన సుఖం చూడ నిచ్చగించని విధంగా మారిపోయిన మానవ నైజా నికి ఒకింత చకితుడై, ఆపై అదంతా 'మిహికరాజు మహిమ ఫలితం'- అని కనుగొన్నవాడై ఆ అప్రతిమ ప్రతిభావిశేషాన్ని తానెక్కడ యెదుర్కోవలసి వస్తుందోనన్న భయంతో పడమటి తలుపు వైపు పరుగులు తీస్తాడట! మరీ ఆలస్యం చేస్తే ఆ చలిరాజు కరాళదంష్ట్రిలలో చిక్కుకొనగలనన్న భయమేమో!

ఆ. పొడుపు గొండమీద బొడుచుట మొదలుగా
పరుగువెట్టి యినుడు పశ్చిమాద్రి
మఱుగు జొచ్చెగాక మసలిన, జలిచేత
జిక్కి జిక్కి ననగ జిక్కకున్నె?

(శ్రీమద్భాగవతము-దశమస్కంధము)

అంతేకాదు, అగ్నిదేవునికీ యీ బాధ తప్పలేదు. చలిరాజుకు చేతులెత్తి మ్రొక్కినందుకే శంభుకంట నొకటి, జలరాశి నొకటి, మనుజ మందిరములలో నొకటిగా వెలిగే అవకాశం అతనికి చిక్కిందట! బడబాగ్ని, ఆహితాగ్ని,రుద్రుని మూడవ నేత్రములోని అగ్నులను యీ విధంగా వర్ణించి పోతన తన 'చలి బాధ'ను కావ్యంలో శాశ్వతం చేసుకున్నాడు.

కవి చాలా స్వార్థపరుడు. తనకున్న గుణాలలో మంచివనుకునే వాటిని తన కథానాయకునికి అపాదించనిదే నిద్ర పట్టదేమో అతనికి. కంకంటి పాప రాజు స్వయంగా భోజన ప్రియుడేమో! తన యీ సుగుణాన్ని కథానాయకునికి కట్టబెట్టి తన జిహ్వాచాపల్యాన్ని సమర్థించుకున్నాడు. రావణ వధానంతరం శ్రీరాముడు పట్టాభిషిక్తుడైన పిదప సుగ్రీవ విభీషణాదులతో ఏక పంక్తిని కూర్చుండి భోజన మారగించిన వైనం యెంత చక్కగా వుందో చూడండి :

చం. వలపులు గ్రమ్మగా బొగచి, వండిన కారపు కాయగూర, ల
ప్పడములు, దియ్యచే రొలుపు బప్పు రసావళలింపు టోగిరం
బు లపుడు, గాఁచి తెచ్చు ఘృతమున్ బలుమాంసము లర్కపుత్రము
ఖ్యులు రఘురాము బంతి బ్రియమొప్ప భుజించి సుఖించి రెంతయున్.

—శ్రీ మదుత్తర రామాయణము.

సతతమతి మనోజ్ఞః క్రౌంచమాలా పరీతః
ప్రదిశతహిమ యుక్త కాలయేషః సుఖేన''

ఈ హేమంత ఋతువు మహిళల మనసులను దోచేస్తుంది. కొల్లగా పండిన పంటలను చూచి ఆనందం ఒకవైపు, ''యెప్పుడు కోయాలి? యెలా వీటిని అమ్ముకోవాలి''— అన్న ఆందోళన మరోవైపు యీ రెండింటితో వ్యాకుల మనస్కులయిన గ్రామ ప్రజలు. అందమైన సాయం సమయాల్లో బారులు తీరి వెళుతున్న క్రౌంచ పక్షుల హడావిడి, అక్కడక్కడ పడుతూ వాతావరణాన్ని చల్లబరిచే మంచు బిందువులు యిన్ని అందాలతో కూడిన హేమంత కాలం అత్యంత సుఖమైనదట!

ఇది యిలా వుండగా యీ చలికి యేమాత్రమూ వెరవక నడివీధి నిలబడి హిమరాజును వెక్కిరించే ధీశాలులు కొందరున్నారు. వారెవరో తెలుసా! కన్నెపిల్లలు. లేడి పిల్లల్లా తుళ్ళి తుళ్ళిపడే యీ అమ్మాయిలను చూచేకాబోలు బాలగంగాధర తిలక్ తన అక్షరాలను వెన్నెలలో ఆడుకునే కన్నెపిల్లలతో పోల్చాడు మరి. ఈ గడగడలాడించే చలిలో తెల్లవారు ఝామునే లేచి, యింట్లో పెద్దవాళ్ళు ''చల్లటి చలికి లేచి యేమి ముగ్గులో యేమో''- అని విసుక్కుంటున్నా పట్టించుకోక పెద్దపెద్ద రంగవల్లులు తీర్చి, చూడముచ్చటగా రంగులు నింపి, వాటిమధ్య బంతిపూలు పసుపు కుంకుమలతో అలంకరించిన గొబ్బెమ్మలను అందంగా అమర్చి, సుబ్బి గొబ్బెమ్మ - శుభమూ లియ్యవే - అని పాడుతూ ''మొగిలీ పూవంటీ మొగుణ్ణియ్యవే" అని మనసులో సిగ్గుపడుతూనే కోరుకునే యీ కన్నెపిల్లల కోరికలను వినే యీ హేమంత సీమంతిని వాళ్ళ కలలకు కమ్మటి రూపునిచ్చే ప్రయత్నం కూడా చేస్తుందేమో!

అటువంటి మనస్విని అయిన హేమంత సీమంతినికి హిమరాజు వజ్రముల రాశిని బహూకరించాడంటే అందులో ఆశ్చర్యం లేదేమో!

శా. ప్రాతర్వేళల మించుదిక్కుగుమి జొంపంబైన లేబచ్చికల్
శ్వేత శ్రీ దుళకించు రెంతయు రహించెన్ సర్వభూతంబులున్
శీతక్రాంతి వడంక దా నచలయై చెల్వొందు భూదేవికిన్
శీతర్తు ప్రభుడిచ్చు వజ్రముల రాశింబోలె నల్వంకలన్''

(విశాలాంధ్ర-1979)



ఆ నోటా-యీ నోటా పాడిన కథలు వీటికి వున్న ప్రాముఖ్యతా అంతా యింతా కాదు. ఎవరయినా, యేదయినా విషయాన్ని గూర్చి మాట్లాడేటపుడు తేల్చేస్తూ, "ఆ... అదో పెద్ద కథలే"- అంటారు. ఆ మాట వినడంతోనే యివతలి వాళ్లలో యెక్కడలేని ఉత్సాహం పుట్టుకొస్తుంది. "అబ్బబ్బ...అదేమిటో చెప్పి యేడవకూడదటోయ్" అంటూ వాకిచుట్టూ చేరుతారు. ఇవతలి వారినుండి 'ఆ కథ' యేమిటో తెలుసుకోకపోతే వాళ్ళకి వూపిరాడదు. అంటే ప్రపంచంలో ప్రతి సమాజంలోనూ వూహ తెలిసినప్పటి నుంచీ యీ కథనం మొదలవుతుంది. అది ఒక సంఘటన గురించి కావచ్చు. ఊహ కల్పితమూ కావచ్చు. మానవులకు సంబంధించినది కావచ్చు. 'పంచతంత్రం'లా జంతువులూ అందులో మనుమల్లాగే చోటు చేసుకుని మాట్లాడుకోవచ్చు. యేమయినా చేయవచ్చు. మనకు కావలసింది కథ, కథకుడు. అతనికి రవంత మాటకారితనం. అలాంటివాళ్ళ చుట్టూ పళ్ళగంప చుట్టూ మూగినట్టు మూగుతారు జనం. పనిపాటలు పూర్తి చేసుకొని తీరిగ్గా కథలు చెప్పుకునే వాళ్ళు కొందరు. చీకటి చలిలో ఆరు బయట వెన్నెల కాస్తుండే 'ఊహుహూ' అని వణుక్కుంటూ "అప్పుడేమయింది", "ఆ తరువాతేమయింది" - అంటూ అడిగడిగి చెప్పించుకునేవాళ్లు కొందరు. అన్నాలు తినకుండా పిల్లలు గోలపెడుతుంటే "ఇదుగోండ్రా, మీరంతా బుద్ధిగా అన్నాలు తిన్నారంటే తరువాత ఆరుబయట వెన్నెల్లో కూచుని రాకుమారుడు సప్త సముద్రాలు దాటి రాక్షసుణ్ణి చంపి రాకుమార్తెను తెస్తాడే, ఆ కథ చెప్తాన"ని ఊరించి పిల్లలకు కథలు చెప్పే బామ్మలు, నాన్నమ్మలు, తాతయ్యలు యిలా యెన్నో రకాలు.

ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే - తెలుగు వాళ్ళకు అనేక వందల సంవత్సరాలనుంచీ కథా వాఙ్మయం వుంది. దానికి ఓ నిశ్చిత రూపమంటూ యేర్పడినది యీ శతాబ్దిలోనే. నేటి కథా సాహిత్యంపై పాశ్చాత్య సాహిత్య సంపర్క ప్రభావం కూడా యెక్కువ.

ప్రపంచ కథా వాఙ్మయంలో జపాన్, టర్కిష్, రష్యన్ సాహిత్యాభివృద్ధిని పరికిస్తే ముందుగా తెలుగులోనే కథా వాఙ్మయం పుట్టింది అని రూఢిగా తెలుస్తుంది. బృహత్కథ, బుద్ధదేవుని జాతక కథలు, కథా సరిత్సాగరం, - యివన్నీ ప్రాచీన కథా సాహిత్యానికి నిదర్శనాలు. అంతేకాదు, ఉపనిషత్తులలోని

3. పాఠకుని మనస్సు కథపైనే లగ్నం అయేలా చూచుకోవాలి.

4. సంభాషణలు మలచటంలో రచయిత సామర్థ్యం ఎక్కువగా బయట పడుతుంది. అనవసరమైన సంభాషణల ద్వారా పేజీలు పొడిగించి పాఠకుల మెప్పు పొందాలనుకోవటం ఒకవిధంగా వారిని తక్కువగా అంచనా వేసి తాను అభాసుపాలు కావటమే అవుతుంది. అలాకాక ఎంత తక్కువ మాటల్లో చెప్ప గలరో, అంతే తక్కువ సంభాషణల్లో చెప్పగలగటం ఆ రచయిత నైపుణ్యాన్ని సూచిస్తుంది.

5. ఆఖరిదయిన యీ సూత్రం కథా రచయితకు అతిముఖ్యమైనది. మొత్తం రచన చేసిన తరువాత రచయితగా కాక, ఒక పాఠకుడుగా తన కథను తానే చదువుకుని, ఆ కథ ప్రభావం పాఠకునిగా ఎలా ఉంటుందో బేరీజు వేసు కోవటం, అదీ నిష్పక్షపాతంగా. అది అన్నిటికంటే ముఖ్యంగా రచయిత గుర్తుంచుకోవలసిన సూత్రం.

గురజాడ అప్పారావు గారి కథ 'దిద్దుబాటు' యీ సూత్రాలన్నింటినీ ఖండితంగా అనుసరించింది. దానిలో కథానాయకుడు గోపాలరావు తన పనులకు తానే సిగ్గుపడిపోతాడు. భార్య యింటిలో కనిపించక - యేమైపోయిందో తెలి యక, ఆ ఆతృతలో నౌకరుముందు బయటపడిపోతాడు. ఆ నౌకరు కూడా మంచి తెలివైనవాడు. యజమాని దగ్గర చమత్కారంగా మాట్లాడుతాడు. భార్య యెలాగయినా తిరిగివస్తే చాలని గోపాలరావు పశ్చాత్తాపపడుతుండగా మంచం క్రింది నుండీ గాజుల గలగల- నవ్వుల కిలకిలా వినవచ్చి, తృప్తినిస్తాయి. చెడు దారి పట్టిన మగణ్ణి యెలా దారికి తీసుకురావాలో, నేర్పుగా చూపిన ఆ యిల్లాలి తెగువతనం- మనకు మరుపురాదు. ఇంకా "మీ పేరేమిటి?'' ''పెద్ద మసీదు'' యివి చిరస్థాయిగా నిలిచిపోయిన కథలు.

అప్పారావుగారి యీ సంప్రదాయాన్ని అందుకుని సాగిపోయి, కథా వాఙ్మయాన్ని సుసంపన్నం చేసిన రచయిత లెంతో మంది. వారిలో కొంతమంది పాశ్చాత్య సాహితీ సంప్రదాయాలను బాగా ఆకళింపు చేసుకున్నవారు వున్నారు.

రాణి యువలోకాన్ని గుప్పెట్లో వుంచుకొని, వాళ్ళ మనసుల్ని తన చేతిలోని కలంలా అటూ యిటూ ఆడించగలిగిన నేర్పుగల రచయిత్రి. ఆవిడ కలం ప్రభావం అటు పాఠకులపైనా, యిటు రచయితలపై-రచయిత్రుల పైనా సమానంగా పడ్డదని చాలామంది అభిప్రాయం. ఇంకా డాక్టర్ పెళ్లకూరు జయప్రద, పవని నిర్మల ప్రభావతి, పోలాప్రగడ రాజ్యలక్ష్మి, ఐ.వి.యస్. అచ్యుతవల్లి, డి. కామేశ్వరి-యిలా యెంతో మంది రచయిత్రులు కథా సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తున్నారు.

లత సాహిత్యాన్ని తలవనిదే తెలుగు కథా సాహిత్యావలోకనం పరిపూర్ణం కాదేమో !

ఈ తెలుగు కథా వికాసంలో రచయిత్రుల దోహదానికి, వాళ్ళ విజయానికి కారణ మేమిటో తెలుసుకోవాలంటే మూడు అంశాలు మనకు ఉపకరిస్తాయి. ఒకటి వస్తువు, రెండవది శిల్పం, మూడవది భాష. లత గారి ''మదరిండియా'' అన్న కథలో తన అవసరాల కోసం కన్నతల్లిని సైతం అమ్మటానికి వెనుకాడని కొడుకుల కర్కశ మనస్తత్వాల వాస్తవ చిత్రణ వున్నది. వాసిరెడ్డి సీతాదేవి గారి నిశిత పరిశీలనాదృష్టికి ప్రతీక మిసెస్ కైలాసం పాత్ర. శ్రీమతి డి. కామేశ్వరి గారి ''రొట్టె ముక్క'' కథ దిక్కులేని పిల్లవాడు తిండి కోసం పడే పాట్లను యెంతో చక్కగా చిత్రీకరిస్తే, నిర్మల ప్రభావతి గారు ''వారాల అబ్బాయి''లో ఒక సామాన్య గృహిణి మనసులో రేకెత్తిన భావాలను యెంతో చక్కగా చెప్పగలిగారు. ఇలా సమాజం అట్టడుగున వున్న అంబేద మొదలుకొని ఉన్నత స్థానాలు ఆక్రమించిన శ్రీమంతుడి వరకూ యెన్ని రకాల మనుషులు, యెన్ని రకాల ప్రవృత్తులు, యెన్ని సమస్యలు, యెన్ని సంఘర్షణలూ యెన్ని ఆరాటాలు యెదురవుతాయో యీనాడు రచయితలూ, లేదా రచయిత్రులూ తమ కథల్లో అద్దంపట్టి చూపుతున్నారు. వివాహ సమస్యలు, భార్యాభర్తల మధ్య కలహాలు, కుటుంబ పరిస్థితి, నిరుద్యోగం, సాంఘిక నేరాలు-యిలా యెన్నెన్నో విషయాలపై తమ దృష్టిని నిలిపి - వ్రాయగలిగిన సామర్థ్యం వుండేవారికి కథా వస్తువుల కొరత లేదని నిరూపిస్తున్నారు.

రెండోది శిల్పం. ఎత్తుగడలో, వర్ణనలో, సంభాషణలో, ముగింపులో ప్రత్యేకత. యెక్కడో కథ మొదలవుతుంది. కొంతవరకు సాగిన తరువాత - హఠా

ఆయా ప్రాంతీయ భాషల వైశిష్ట్యాన్ని యెంతవరకు రచయిత గుర్తించగలిగారో పాఠకునికి తెలుస్తుంది.

ఇలా కథా సాహిత్యం పుంఖానుపుంఖాలుగా అభివృద్ధి చెంది, సమాజానికి అద్దం పట్టడమే జరుగుతూంది. కానీ చాలా మందికి 'కథా రచన' అంటే పెద్ద గౌరవం లేదు. "ఆ...యేటో ఒక సంఘటన, ఒకటి రెండు పాత్రలుంటే చాలు. కథ రాయడ మేముంది... ఆఫ్టారల్... A matter of no importance"- అనవచ్చు. కానీ కథా రచన వాళ్ళనుకుంటున్నంత సులభమేమీ కాదు. అతి పెద్ద కాన్వాస్‌పై పికాసో చిత్రం చిత్రీకరించటం వేరు. ఒక చిన్న బియ్యపు గింజపై భగవద్గీతను వ్రాయగల్గటం వేరు. రెండూ కళలే అయినా- వాటి రచనలో యెంతో భేదం వుంది. వాటి పరిధులూ, ప్రయోగ విశేషాలూ వేరు. అలాగే వచన సాహిత్యంలోనున్న మరో ప్రక్రియ నవలకూ, కథారచనకూ కూడా యెంతో భేదంవుంది. కొండకూ వజ్రానికీ యెంత భేద ముందో నవలకూ, కథకూ అంతే భేదమున్నదనీ, రెండింటి స్వరూప స్వభావాదు లంత దూరమనీ ఫ్రెడెరిక్ బి. పెర్కిన్స్ అభిప్రాయం. ఆకృతిలో విస్తృతి వున్న కొండ సౌందర్యం వేరు; అల్పంలోనే అనల్ప సౌందర్యాన్ని వెలువర్చించే వజ్రపు అందం వేరేగదా! కథకూ, కథానికకూ కూడా కొలెదంత భేదం వుంది. కథ వజ్రమయితే- కథానిక సానబెట్టిన వజ్రం. దీని పనితనం దానికి రాదు. సానబెట్టేకొద్దీ వజ్రపు తళుకు యెక్కువైనట్లు కథ విస్తృతి యెంత తక్కువయితే- కథనం అంత ప్రతిభావంతమవుతుంది- 'సూక్ష్మంలో మోక్షమున్నట్లు' కథ కథే. కథానిక కథానికే. కానీ మనకు అలవాటులేక అన్నింటినీ కథానికలనే అంటున్నాం.

కొంతమంది పట్టణ వాతావరణానికి దూరంగా సనాతన సంప్రదాయాలను పాటిస్తూ బ్రతికేవారుంటారు. వాళ్ళు-వాళ్ళున్న పరిసరాలను - నిండు చంద్రుణ్ణీ, రంగురంగుల పూలనూ, మబ్బు కన్నెలనూ వర్ణించే రచనలనూ యింకా ప్రపంచాన్ని రంగుల్లో ఊహించుకునేలా రాసే రచనలనూ యిష్టపడుతారు. ప్రాచీన సాహిత్యంతో పరిచయమున్న వారయితే పెద్దనగారి అల్లిక జిగిబిగి [illegible] కథల్లో వుండాలంటారు. ఇలాంటి వారికి సాధారణంగా రాజకీయాలపై అంత మక్కువ వుండదు. సమాజంలో యే మార్పు వచ్చినా, నాయక ప్రతి

వున్నది. ఈ యాంత్రిక యుగంలో మానవ జీవనానికి విలువే లేకుండా పోతుంది. ''ధనమూలమిదం జగత్''గా వుంటున్న యీ రోజుల్లో మానవతా విలువలను పరిరక్షించుకునే అవకాశాలే కనుమరుగై పోతున్నాయి. కానీ వేలకత్తులు చేయలేని పని ఒక్క కలం చేయగలదన్నది కూడా నిజమే గదా! ఈనాటి సమాజంలో జరిగే ప్రతి అరాచకానికీ, అన్యాయానికీ, రచయిత హృదయం స్పందించి ఆ కంట కన్నీరు చిలికినప్పుడే సాహిత్యం చైతన్యవంతమవుతుంది. నిప్పులు చెరిగే యెండలో తలపై యే ఆచ్ఛాదానా లేకుండా సలసలా కాగుతున్న తారును కంకర రాళ్లతో కలిపి, ఆ మిశ్రమాన్ని రోడ్డుపై వేసి, చదును చేసేందుకు శ్రమ పడుతున్న కష్టజీవులను చూడటంతో ఓ సామాజిక స్పృహగల్గిన రచయిత మనసు పిండినట్లవుతుంది. అలా బ్రదుకుతున్న వారి కథ నేటి కథాకావ్యంగా మారుతుంది. కేవలం రమణీయార్థ ప్రతిపాదకమే కావ్యమన్నది ఆనాటి మాట! హృదయాన్ని కదిలించే మాట యేదయినా (అది కేవలం రమణీయార్థ ప్రతి పాదకమే కాకపోవచ్చు కూడా) అది కావ్యమే ననిపించుకుంటుంది.

కానీ, ఇలాంటి 'సామాజిక స్పృహ' అన్నది కేవలం కొద్దిమంది రచయితల్లో లేదా రచయిత్రులలో కనబడటం శోచనీయమైన విషయం. నిజానికి తాను వ్రాసిన కథను తానే కొంత కాలమైన తరువాత చదివితే నచ్చకపోవచ్చు. ఎందుకంటే, అది వాస్తవ పరిస్థితిని చిత్రీకరించకపోవటంవల్ల ఈ స్థితి ఏర్పడవచ్చు. కేవలం వాస్తవ పరిస్థితిని సహజంగా చిత్రీకరించటమే కాదు. ఆ సమస్యకో పరిష్కారం చూపించగలిగివుండాలి. ఉదాహరణకి శ్రీమతి డి. కామేశ్వరి గారి 'రొట్టెముక్క' అన్న కథ. రొట్టెముక్క కోసం పరిగెత్తుతూ ప్రమాదవశాత్తూ రైలు క్రింద పడి చనిపోయిన అబ్బాయి కథ. దేశాన్ని నేడు రాక్షసిలా పట్టి పీడిస్తున్న ఆర్థిక సమస్య చిత్రీకరణ ఎంతో హృద్యంగా జరిగినా "ఈ సమస్య ఇలా సాగిపోవలసినదేనా! దీనికో పరిష్కారం లేదా?'' అనే సందేహం పాఠకునిలో కలుగకమానదు. కనీసం యాభై, అరవై సంవత్సరాల క్రితం గురజాడ వంటి మహనీయులు వ్రాసిన కథలీనాడూ నిత్య నూతనంగా ఉన్నాయంటే దానికి కారణం దానిలోని జీవమే. రచయిత తనను తాను చూచుకొని, తన చుట్టూ జీవితాలను పరిశీలించి వ్రాసిన రచనలు చదివిన వ్యక్తినేకాక సమాజాన్ని కూడా ప్రభావితం చేయగలిగివుండాలి. ఆ విధంగా చేయలేని రచన పదికాలాలపాటు

రచనను వెనక్కి పంపిస్తూ ఇలా వ్రాశారట: ''మీ రచనలో శైలి, పాత్రచిత్రణ, వర్ణన అత్యద్భుతంగా, అద్వితీయంగా ఉన్నాయి. కానీ మీ ఈ రచనను అర్థం చేసుకోగలిగే స్థాయి మా పాఠకులలో లేదు. అందువల్ల నేటి పాఠకుల స్థాయిని దృష్టిలో ఉంచుకుని చేసిన రచన దయచేసి పంపండి.'' అంటే సమాజాన్ని వాస్తవికంగా చిత్రీకరించాలన్న దృష్టితో ఉన్న రచయిత్రులూ ఒక మెట్టు క్రిందికి దిగివచ్చి రచన చేస్తేగాని వెలుగులోకి వచ్చే అవకాశం లేదన్నమాట! కాబట్టి పాఠకులలో మార్పు కూడా ముఖ్యాంశమే. దానిపైనే పత్రికాధిపతుల నిర్ణయాలూ ఆధారపడివుంటాయి. అందరూ తమ రచనలను స్వంత ఖర్చుపై ముద్రించుకునే ఆర్థిక స్తోమత కలవారై ఉండరు గదా!

ఏది ఏమైనా ఒక ఆశయాన్ని, లక్ష్యాన్ని, నవ్యమార్గాన్ని, మానవతను ప్రతిబింబించే కథలు నేడు అవసరం. ఆ కొరతను కొంత రచయిత్రులూ పూరించగలరని ఆశిద్దాం.

( విశాలాంధ్ర - 1979 )



రమ్యాలను వర్ణించి, కవి తన పాఠకులను వాస్తవ దృష్టినుంచి వంచితుణ్ణి చేశా డిన్ని రోజులూ. ప్రపంచమంటే యిదీ, మన ప్రగతి పరిస్థితి యిలా వుందని చూపిస్తూ సమాజం నిజమైన వెలుగును చూసే మార్గాన్ని కవి లేదా రచయిత తన రచనలలో వ్యక్తీకరించ గలగాలి" అన్నది చాలా మంది అభిప్రాయం. ఏనాడో హాలుడు సేకరించిన 'గాథా సప్తశతి' ని ఓ మారు పరిశీలిస్తే ఆ నాటి కవులలో యీ సామాజిక స్పృహ యే స్థాయిలో వుండేదో అవగత మవుతుంది. ప్రాచీన కవుల గురించి యీ నాటి అభియోగం గురించి కాస్త సందేహమూ కలుగకపోదు. ఆనాడు సామాజిక స్పృహ కలిగిన రచయితలున్నారు. ఆ నాటి సంఘ పరిస్థితులను యథాతథంగా చిత్రించటానికి వారు కృషి చేశారనేందుకి 'గాథా సప్తశతి' కొంతవరకూ ఉపకరిస్తుంది. ఈ నాడున్నట్టే ఆనాడూ రచనలో రచయిత్రులూ పాలుపంచుకోవటం మరో విశేషం. ఏది ఏమయినా తినబోతూ రుచులు చెప్పటం భావ్యంకాదు కనుక అసలు విషయానికి వద్దాం.

'గాథాసప్తశతి' లో తరతమ భేదం లేకుండా అన్ని రకాల జీవితాలూ కనిపిస్తాయి. రచ్చ బండలు, మోటబావులు, తోటల్లో పొలాల్లో శృంగారాలు, సామాన్యమానవుని జీవితం, దారిద్ర్యం, ఆకలి గాథలు, వైభోగాలు, వసంతోత్స వాలు, ప్రేమ, విరహం, బాటసారులు, విధవలు, వేశ్యలు, పంటలు, నాట్యాలు-ఓహ్! యిలా చెబుతూ పోతే యెన్నెన్నో జీవిత చిత్రాలు దర్శనమిస్తాయి. అతి సాధారణ విషయాలు మొదలు, గొప్ప వూహా సౌధాల వరకూ ఇందులో చిత్రీకరించబడ్డాయి. ఒక్క మాటలో చెప్పాలంటే తెలుగుగడ్డలోని గడప గడప లోనూ వున్న విశే షాలు యీ రచనలలో కనిపిస్తాయి. హాలుడు ఆంధ్రరాజు, కుంతల దేశాన్ని పరిపాలించాడు. 'కుంతల దేశం' అంటే యీ నాటి బళ్లాం చుట్టు పట్ల ప్రాంతం అన్నమాట! కనుక రాయలసీమ భావాలు కూడా చాలా వుంటాయి. సాహిత్యంలో మొట్టమొదట యీ విధంగా అనేక గాథలను సేకరించిన గౌరవం హాలునికే దక్కింది. కేవలం సేకరించడమే కాదు. కొన్ని గాథలను ఆయనా రచించాడు. ఇందులోవన్నీ ముక్తకాలే. 'గాథా సప్తశతి'లో ముఖ్యంగా వాడబడిన భాష - అర్ధమాగధి. ప్రాకృతభాషలో అనేక రూపాలున్నాయి. అవి చూళిక, అపభ్రంశము, శౌరసేని, పైశాచి, మాగధి, అర్ధమాగధి మొదలైనవి. కాళిదాసు సంస్కృత నాట కాల్లో కూడా కొన్ని పాత్రలకు అర్ధమాగధి భాషే వాడబడిందట!

కిం కిందే పడిహాసయి ? సహీహిం పుబ్బ అయేఁ ముద్ధాయే
పఢముగ్గఅ దోహాణీయే ణవరం దయిఅం గఅ దిఠ్ఠీ-

''చెలులు చెంతజేరి తొలి చూలి కైకల
నేమి కోర్కె నీకు నెఱుగ జెప్పు
మనుచు గ్రుచ్చి యడుగ నందంద దయితుడౌ
మగని కడకె పాఱె ముగుద చూడ్కి''-

తనకు యిష్టమైన పదార్థాలు చాలా వుండవచ్చు. కానీ అవి అన్నీ తాను నోరు విడిచి చెబితే- వాటిని చేయించేందుకు భర్త యేమి కష్టాలు పడవలసి వస్తుందో! అయినా ఆయన కంటే తన కిష్టమైన విషయం యేముంది గనుక ? అనుకుంటూ ప్రేమగా ఆ గృహిణి భర్తవైపు తన దృక్కులు సారించిందట !

భర్తను కష్ట పెట్టకూడదన్న భావం ఆతనిపట్ల ఆమె ప్రేమ ఆ చూపులో వ్యక్తమయింది.

మరొక యింటిలోకి వెళ్ధాం పదండి. ఆ యింటిలో యజమాని ఒకప్పుడు బాగా బతికి చెడినవాడు. కానీ అతనికి ఆ యింటి పరువు, మర్యాద, పెద్దయింటి తనము యింకనూ నిలుపుకొనవలెనన్న ఆతృత. దానితో తన యింటికి వచ్చే బంధుజనులను సకల సత్కారాలతో గౌరవించి - తాను అప్పులపాలవుతూ వుంటాడు. అటు యిల్లాలి పుట్టింటివారు పరామర్శలకు పలకరింపులకూ వస్తూ పోతూనేవుంటారు. వాళ్లు వచ్చినప్పుడల్లా. భర్త గౌరవాలకు పోయి అప్పులపాలు కావటం భరించలేదావిడ ! అందువల్ల తన ఇంటికి తన్ను చూడవచ్చే బంధువులు (వారు భాగ్యవంతులయినాసరే) మాటి మాటికీ నన్ను చూడటాని కెందుకు రావటం ? లక్షణంగా వుండక పోతామా ? అని విసుక్కుంటూ వుందట! ఇలా గౌరవ మర్యాదలకై అప్పుల పాలయ్యే యింటి యజమానులూ, భర్త మీద ప్రేమ ఆయన పరువు నిలబెట్టాలన్న తపన వున్న ఇల్లాళ్ళూ ఈనాడూ మనకు తారసిలక పోరు.

"ఇంటి పెద్దతనము నెచ్చుగా మన్నించు
పేదమగని పరువు పేరు నిలుప

దుర్భర దారిద్ర్యాన్ని తలచుకొని దుఃఖిస్తున్న ఆ ఇల్లాలి కంటినీరు ఆ పిల్లవాని తలను తడుపుతున్న సంగతిని ఆమె గమనించనేలేదట! ఎంతటి దౌర్భాగ్య స్థితి! ఇలాంటివారు ఈనాడు మన ప్రాంతంలో కనిపించకపోరు.

''చూఱునుండి వాననీఱు గారగ దల
యడ్డుపెట్టి కొడుకు నాదుకొనెడు
గాని, పాంథగృహిణి, కన్నీటవానిని
దానె తడుపుచుంట గానదకట!''

నీతి నిజాయతీలు దాదాపు మృగ్యమైపోతున్న ఈ రోజుల్లో నీతి - నిజాయతీ-సత్యాహింసలంటూ ఇంకా ప్రాకులాడే కొంత మంది జీవితాలు యిలాగే తెల్లవారిపోవటం బహుశా మనలో కొంత మంది చూసే వుంటాము. చూస్తూ వుంటాం కూడా. ఏనాడో హాలుడు సేకరించిన ఈ గాథ యథాతథంగా ఈనాటి పరిస్థితులకూ అద్దంపడుతోందంటే అది ఆ కవి నిశిత దృష్టికి నిదర్శనం కాక మరేమిటి?

''పేదరాలు నిండు వేవిళ్లకాలమం
దేమివలతు? వనుచు నెందఱెన్ని
మారు లడుగుచున్న 'మంచి నీరే' యను
మగని కలత బెట్ట మనసు రాక.''

—ముకుందుడు

ఈ గృహిణిని చూడండి. వేవిళ్ళకాలంలో చెలులు చెంతజేరి, 'తనకున్న కోర్కెలు ఏమిట'ని నొక్కి యడుగుచుండగా ఆవిడ తన పేద భర్తను కష్ట పెట్టుట ఇష్టములేక 'మంచినీరే' యని మరి మరి నుడువునట!

పైరు కోర్కెమీర పండ శారద వేళ
బాడు నిచ్చకొలది బళ్లెరైతు
చక్కదంచినట్టి సన్న బియ్యము బోలు
వన్నె గలుగు నిండు వెన్నెలలను"—

ప్రొమొక్కెదము నిదురతల్లికి
దక్కంగల కోటి దేవతలు మాకేలా
యెక్కడ దవ్వుల నున్నను
జిక్కెడు నా తల్లి కరుణచే ప్రియుడు కలన్—

ప్రియుడు ప్రవాసమున కేగినాడు. మరి అది యే శరదృతువో- హేమంత ఋతువో! 'విరహబాధ' ఆమెను పూరక కూర్చుండ బెట్టునా! పాపమా బాధ నోర్వలేక యేడ్చి యేడ్చి సొమ్మసిల్లిన ఆమెకు కలలో ప్రియుడు సాక్షాత్కరించి, సాంత్వనపరచి- సంతసమందించెను. ప్రియుడు ప్రవాసమున కేగెనను బాధ కొంత ఉపశమించినది. మరి అటువంటపుడు నిదుర తల్లికి మొక్కులిడక మరి యెవరిని తలచుకుంటుందామె?

ఆమె ప్రతీక్ష ఫలించింది. అమె ప్రియుడు వస్తున్నాడన్న దానికి సూచ నగా 'యెడమ కన్ను' అదిరిందట. మరి ఆ శుభ సూచన నందించిన ఆ కంటితో యేమంటూందో వినండి-

అదిరె డెడమకన్ను! యిందుకు ఫలముగా
నిపుడు ప్రియుడు వచ్చెనేని యిటకు
కోర్కెదీఱునట్లు కుడికన్ను మూసి నీ
తోన చాలసేపు జూతువాని!

ఎడమకన్ను అదిరితే ఆడవారికి శుభవార్త వినే సూచన అని ఓ నమ్మకం. ఈవిడగారికి యెడమ కన్ను అదిరిన వెంటనే ప్రియుడు రావచ్చునన్న వూహ మెదిలింది. అంతకంటే ప్రియమైన శుభవార్త ఆమె కింకేముంటుంది? సాధార ణంగా యేదైనా శుభవార్త మోసుకొచ్చిన వారికి యేదో ఒక పారితోషికమివ్వటం మన ఆనందానికి సూచన. కానీ యీవిడకు యేదో ఒక వస్తువిచ్చి అంత మంచి వార్తను అందించిన యెడమకన్ను ఋణం తీర్చుకోవటం భావ్యంగా అనిపించ లేదు. మొక్కుబడిగా ఆ పని చేయటం యిష్టపడని ఆమె తన అవధుల్లేని ఆనం దాన్ని ప్రియదర్శన భాగ్యాన్ని ఆ యెడమ కంటితోనే పంచుకుంటానని హామీ యిస్తూంది. ప్రేమలోనూ సున్నితత్వము, విశాల మనస్తత్వం యిక్కడ అవగత మవుతూంది.

మరి యిన్ని రుచులందించే గాథాసప్తశతీకారునికి మనమూ మన ఆనందం తెలియజేసేందుకు యే బహుమతి యివ్వగలము- ఆ అనుభూతులకు స్పందించే మనసు తప్ప!!

(ఆంధ్రప్రభ, దినపత్రిక)

5) ఫిబ్రవరి - 1981.

అంతెందుకు, ఆయన కలం కదలాడిన చోటంతా మల్లెల మత్తెక్కించే వాసన, అది విషాదమైనా, వియోగమయినా, చదువరుల హృదయాలను మరి మరీ చదివిస్తుంది. బరువెక్కిన ఆ హృదయాలు ఒక చెంప ఆయన సృష్టించిన విషాద సమాధిలో నిమగ్నమయినా- మరో చెంప మరి మరీ ఆ రచనలు చదివేలాచేసే అందమైన విపరీత. ఈనాడు భౌతికంగా ఆయన యీ లోకంలో లేకున్నా- ఆయన పాఠకుల్లో, అభిమానుల మనసుల్లో చిరంజీవి. సాహిత్యావలోకనం ద్వారా ఆయన్ని గుర్తుకు చేసుకోవటం బాధాకరమే అయినా- వేదనతోనే ఆనందాన్ని వెతుక్కునే ఆయన మనస్తత్వాన్ని గుర్తుకు తెచ్చుకోవటం అందరికీ ఆనంద దాయకమే గదా !

వారి కవితావనంలోకి ప్రవేశించే ముందు కవిసామ్రాట్ విశ్వనాథ వారి మాటలు గుర్తుచేసుకుందాం. "భావ కవిత్వమనేది అవగతమయే విషయం కాదు. హృదయానికి అవగతమయ్యేది. నీ హృదయంలో యేదో తారాడుతుంది. అది బాధగా వుంటుంది. ఆ బాధలో సుఖం వుంది. అది జీవుణ్ణి కదిలిస్తుంది. ఇదే భావ కవిత్వమంటే. అది వ్రాయగల వాడొక్కడే. అతని పేరే కృష్ణశాస్త్రి"— నిజమే. భావ కవిత్వమనగానే కృష్ణశాస్త్రి గారి పేరే గుర్తొస్తుంది యెవరికయినా. ఆంగ్ల సాహిత్య ప్రభావంతో తెలుగు సాహితీ నందన వనంలో మొలకెత్తిన కొత్తమొక్క యీ భావకవిత్వం. ఆ మొక్కకు పూచిన రంగురంగుల కొత్తపువ్వే దేవులపల్లి. అసలీ భావకవిత అన్నది యేమిటి? ప్రకృతి, ప్రేమ, విరహం, దుఃఖం, స్మరణం, ఆధ్యాత్మికత, ఆత్మాశ్రయత్వం, మరణం, యిలా అంచెలంచెలుగా సాగే కవితా ఝరిలో దేవులపల్లి మునిగితేలి, అందులోని లోతుపాతుల్ని గుర్తించి, ప్రేమ అన్న పదానికి అసలైన ముగింపు, గుర్తింపు వేదనలోనే వున్నదన్న సత్యాన్ని 'కృష్ణపక్షం' ద్వారా మనముందుంచారు.

ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేత రెమ్మనై
యీ అడవి దాగిపోనా
ఎట్లయినా
యిచటనే ఆగిపోనా'—

ఎడతెగని యాత్ర నిట్లు సాగింపలేక
యేద్వగాలేక కృశియించు నేనొకండ''

తన స్వేచ్ఛావిహారానికి ఫలితం తనను వరించిన యీ విషాదమంటే, తన వూహాప్రేయసివల్ల ప్రాప్తించిన యీ వియోగమంటే వల్లమాలిన యిష్ట మాయనకు. ఆ విషాదమే భోగంగా పరిణమించి, చివరికి అదే ఆయన తనకై మిగుల్చుకున్న నిరుపమాన సంపద అయింది. దానినే ప్రాణాధికంగా ప్రేమించటం మొదలెట్టారు. ఆ ప్రేమావస్థలోనే గీతం వెలువడింది.

కలువ పూ బ్రదుకులో కనుమోడ్పు వెన్నెలే
కాలానలంబైన గతి యేమీ!
నిరుపేద రెల్లులో నిదురించు సెలయేరె
కల్లోలమేయైన గతి యేమీ!

తనలోని ప్రేమ తననే కాల్చివేసిన వైనాన్ని యెంత అందంగా చెప్పారాయన! విషాదాన్ని ప్రేమించిన తరువాత తన ఉనికి యెక్కడ?

''రేయి కడుపున చీకటి ఛాయ వోలె
తమసు పెడద దివాంధ గీతము విధాన
ఘూకరావాన వలవంతరేక రీతి
నా విషాదమ్ములో దాగినాడ నేనే''

కొండంతటి విషాదాన్ని కడుపులో దాచుకొని తనలాగే సమస్యలతో కొట్టుమిట్టాడుతున్న సమాజం వైపు దృష్టి మరల్చా రాయన.

మానసిక కాలుష్యంతో మనిషి మనిషినే కాటువేస్తున్న యీ కాలపు మనుషులను చూసి ఆశ్చర్యపడ్డారు.

"బోదెలో ప్రేమనే పాలు పోయడు.
మోడు మందారాలు పెడుతుంది.
అటు చాపి యిటు చాపి అభయ హస్తాలల్లి
జగమంత పందిరిని కడుతుంది''

ప్రకృతిలోవున్న యీ హృదయ నైర్మల్యం మానవునిలో లేనందుకు బాధపడతారాయన. 'ఇలాగే సాగితే ప్రపంచం యేరీతిగా పరిణమిస్తుందో' నన్న తీవ్ర ఆలోచన ఒక మార్గాన్ని స్ఫురింపజేసిందాయనకు.

సౌరభములేల చిమ్ము పుష్పవ్రజంబు ?
చంద్రికల నేల వెదజల్లు చందమామ ?
ఏల సలిలంబు పారు ? గాడ్పేల విసరు ?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను ?

తన యీ ప్రేమ పూవాసనవలె, చంద్రకాంతివలె, మలయమారుతమువలె, సహజ సుందరమట ! ఈ తీయని విరహం శాశ్వతం కావాలంటే జరలేని యౌవనం అవసరమట ! అందువల్ల-

'నా పదమ్ములు రెక్కలు నయన యుగళి
ఆరిపోవని తారలు, యాత్ర శిశిర
మధుర మధు జీవవాహిని మసలలేను
నాకు జరలేని యౌవనమ్ము నిమ్ము'—

ఈ అందమైన వియోగాన్ని పరిరక్షించుకోవటానికి అంతకంటే అందమైన యవ్వనం సంపాదించారు. మరి ఆ విషాదాన్ని అనుభవించే తనను జూచి యెవ్వరూ జాలిపడ నవసరము లేదట !

''నాకమూల్య మపూర్వ మానంద మొసగు
నిరుపమ నితాంత దుఃఖంపు నిధులు గలవు''—

అంటారు. అంతేకాదు, ''ఏకాంత యవనికాభ్యంతరమున వెక్కి వెక్కి రోదిస్తా''రట ! ఇంతటి గాఢమైన విషాదాన్ని అనుభవించిన హృదయానికి పరిపూర్ణ శాంతి భగవదన్వేషణలో చిక్కింది. స్మరణం, కీర్తనం, అర్చనం, పాదసేవనం, ఆత్మార్పణం మొదలైన నవ విధ భక్తులలో ఆత్మార్పణమే పరమావధిగా తోచిందాయనకు. అందుకే-

'కురియుమురా కన్నీటిని !
మరి మరి విలపింపుమురా !
పరము గూర్చి పరమేశుడె
తెలుపునురా పాపీ!'

అని తనను తాను మందలించుకున్నారు. అంతేకాదు, ''భవదీయ పదసరోజ మృదురజోలేశ దివ్య సంపదను వలచి'' — వీథివీథుల్లో భిక్షుకునిలాగా తిరుగాడుతానని చెప్పుకున్నారు.

